# స్వరగీత

**(Scholar's Edition)**



శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి, P.O.L

SANSKRIT LECTURER,

*R. B. V. R. R. Women's College,*

HYDERABAD.

**1960**

# స్మరగీత

**( Scholar's Edition )**



శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి, P.O.L.

SANSKRIT LECTURER,

*R. B. V. R. R. Women's College,*

HYDERABAD.

**1960**

## ఉపక్రమణిక

శృంగం హి మన్మథోద్భేద స్తదాగమన హేతుకః
ఉత్తమ ప్రకృతిప్రాయో రస శ్శృంగార ఇష్యతే.

పరోఢాం వర్జయిత్వా తు వేశ్యాంచానను రాగిణీం
ఆలంబనం నాయికాస్స్యు ర్దక్షిణాద్యాశ్చ నాయకాః.

చంద్ర చందన రోలంబరుతాద్యుద్దీపనం మతం
భ్రూవిక్షేపకటాక్షాది రనుభావః ప్రకీర్తితః.

త్యక్త్వౌగ్ర్య మరణాలస్య జుగుప్సా వ్యభిచారిణః
స్థాయిభావో రతిశ్శ్యామవర్ణోయం విష్ణుదైవతః.

(సాహిత్య దర్పణము.)

"శృణాతి చరమదశా ప్రాపణేన హినస్తి కాముకా నితి శృంగమ్." అనగా మరణావధికమగు మాన్మథవ్యాపారము శృంగము. "శృంగమృచ్ఛతి" లేక "శృంగం రాతి=దదాతి శృంగారః" ఆ మాన్మథ వ్యాపారముగలది లేక కలిగించునది శృంగారమని భావము. ఈ శృంగార ముత్తమనాయకాశ్రయము. విష్ణుదేవతాకము. ఈశృంగార నాయకులు అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠులు. "ఈ శృంగారము స్వీయానాయికాశ్రయమగుచో రసము. పరకీయా సామాన్యాశ్రయమగుచో రసాభాసము" అగునని యాలంకారికసిద్ధాంతము.

వేశ్యాంచానను రాగిణీం' అనుటవలన ననురాగిణియగు వేశ్య యొక్క శృంగారము రసమేయగును. మృచ్ఛకటికమున వసంతసేన యనురక్త కాన రసమే. అట్లేని ననురక్తయగు పరకీయ నాయికాశ్రిత శృంగారముమాత్ర మేల రసము కాఁగూడదు ? అనురక్తయగు వేశ్య (వసంతసేనా ప్రభృతులు) అనూఢ కావున దాని

శృంగార ముపాదేయమే. పరకీయ యూఢగావున దాని శృంగార ముపాదేయముగాదు." అందురేమో ? ఊఢయైనను గాకున్నను నది అనురక్తగదా ! పాండవులతోడి ద్రౌపదీ శృంగారము రసాభాసమా? రసమా? అని శంకించి ప్రాచీనులు "ద్రౌపది పాండవులకు ధర్మపత్ని యగుటచే నది రసమే" అని వచించిరి. నవ్యులు "ద్రౌపది యూఢ యైనను బహునాయక నిష్ఠరతిగావున రసాభాసమే" అని సిద్ధాంతీక రించిరి. ఇట నూఢాత్వము గణింపఁబడలేదు. ఊఢాత్వ, అనూ ఢాత్వములను బట్టి కాక యనురక్తత్వ - అపరక్తత్వములను బట్టి రస రసాభాసములను నిర్ణయింపవలెనని నా యభిప్రాయము. ఈ నా యభిప్రాయమున కవష్టంభకముగా నీ క్రింది పంక్తులు గనుఁడు: "గాఢ ప్రణయులగు యువకుల యచంచలమగు ప్రేమ గూడ వ్యభి చారమార్గమునఁ బ్రవృత్తమగు నపుడు లోకుల యపవాదములకు గుఱియగుచుండును. అంతమాత్రమున నది యాభాసమని గణింప నగునా ? వాస్తవిక స్వరూప సిద్ధికిఁ బ్రతిబంధక మేమున్నదచట ? తారాశశాంకుల విషయమునఁ గానీ, అహల్యా సంక్రందనుల విషయమునఁ గానీ వారి ప్రేమ చరిత్రలను జదువునప్పుడు గానీ లేక చూచునప్పుడు గానీ శృంగారము ననుభవించుటలేదా సహృదయ లోకము ? శృంగారాభాసమేమైన ననుభవ గోచరమగుచున్నదా ?

---

*అథాఽత్ర కిం వ్యంగ్యమ్ ?

వ్యానమ్రాశ్చలితాశ్చైవ స్ఫారితాః పరమాకులాః
పాండు పుత్రేషు పాంచాల్యాః పతంతి ప్రథమా దృశః

అత్ర వ్యానమ్రతయా ధర్మాత్మతా ప్రయోజ్యం యుధిష్ఠిరే సభక్తిత్వం, చలితతయా స్థూలాకారతా ప్రయోజ్యం భీమసేనే సత్రాసత్వం. స్ఫారితతయా అలౌకిక శౌర్య శ్రవణ ప్రయోజ్య మర్జునే సహర్షత్వం, పరమాకులతయా పరమ సౌందర్య ప్రయోజ్యం నకుల సహదేవయో రౌత్సుక్యంచ వ్యంజయంతీభి ర్దృగ్భిః పాంచాల్యా బహువిషయాయా రతే రభివ్యంజనాద్రసాభాస ఏవేతి నవ్యాః । ప్రాంచ స్త్వపరిణేతృ నాయక విషయత్వే రతే రాభాసతేత్యాహుః.

రసగంగాధరము.

వారు(ప్రాచీనులు) నుడివిన రసాభాస హేతువు లేమైన నచట నున్నవా? లేవు. కావున వ్యభిచారస్థలములందు వర్తిల్లి నంతమాత్రమునఁ బ్రేమ నాభాసగణములోఁ జేర్చఁబూనుట ప్రాచీనుల పొరపాటు. ఆభాస హేతువుగాఁ బేర్కొనఁబడిన యనౌచిత్యమదిగాదు. రసభావముల స్వరూపసిద్ధికిఁ బ్రతిబంధకముగానున్న కారణజాతము నే యచట ననౌచిత్య పదమున వ్యవహరించితిమి". (ఆంధ్రధ్వన్యాలోకము ౧౨౮ పుట)

దీనినిఁ బట్టియు 'ననురక్తత్వ - అపరక్తత్వములను బట్టియే రస రసాభాసములను నిర్ణయింపవలెను.' అని సిద్ధాంతము దేలుచున్నది. అపుడు పాండవుల తోడి ద్రౌపదీ శృంగారము రసమే యగును. రసాభాసము గాదు. స్వీయా నాయికా నాయకాశ్రితమగు శృంగారము ధర్మశృంగారము; ఇది యుత్తమము. సామాన్య శృంగార మర్థశృంగారము; అనురక్త పరకీయాశృంగారము కామ శృంగారము. అర్థశృంగార, కామ శృంగారములు రెండును మధ్యమ శృంగారమగును. నీచపాత్ర గతమగు శృంగారము, అపరక్తాశ్రయ శృంగారము, ఏకతర నిష్ఠమగు శృంగారమును రసాభాసము. అవిదగ్ధ గ్రామ్య నాయికా నాయక శృంగారము (పచ్చి బూతులు) అధమ శృంగారము లేక తుచ్ఛ శృంగారము అని విభాగించుకొనుట యుచితము. కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపము, అభినవ కృష్ణశతకము, బ్రహ్మానందము, గణపతీయము మొదలగువానిలోని శృంగారము తుచ్ఛము.

పరకీయా, సామాన్యా శృంగారములు ధార్మికములు గావు గావున ననుపాదేయములే యనవచ్చును. కృష్ణునికి రాధతోడి శృంగారము పరకీయాశృంగారమే. మువ్వగోపాల పదములలో నిది పరకీయా శృంగారమే. దీని నీనాఁడు మధురభక్తి యని వ్యవహరించుచున్నారు. అనగా భగవంతునికిఁ బరకీయతోడి శృంగార ముపాదేయమై మధుర భక్తి యైనది. ఈ శృంగారమును లోకము ధార్మికశృంగారముగానే

గణించుచున్నది. సామాన్యయగు రంభతోడి నలకూబరశృంగారము, ఊర్వశితోడి పురూరవునిశృంగారమును రసాభాసముగాఁ గాక రసము గానే లోకము గ్రహించుచున్నది. అనఁగా ధర్మశృంగారముగానే తలంచుచున్నది. కాళిదాసకవి రచిత విక్రమోర్వశీయము ఊర్వశీ పురూరవుల గుఱించిదే కదా! అందలి శృంగారము రసమే కదా! దీనినిఁబట్టి చూడఁబరకీయా, సామాన్యాశృంగారములు గూడ ననురాగ పూర్వకము లగుచో నవి రసములే యగునని విస్పష్టమగుచున్నది. కావునఁ బరిణీతకులనాయికానాయక శృంగార ముత్తమ శృంగా రము; అనురక్త, పరకీయా, సామాన్యా శృంగారము మధ్యమ శృంగారము అనియు నలఁతి భేదమును జాటించుకొనవచ్చును.

సామాన్యా రతి బహునాయక నిష్ఠముగాన నా శృంగారము రసాభాసమని పూర్వు లన్నారు. బహునాయక నిష్ఠమైనను దానినిఁ గూడ రసమే యనియును, దానిని మధ్యమశృంగార మనవలెననియుఁ బైనిఁ జెప్పితిని. ఏలన సామాన్యయైనను నాయకునిపై శుద్ధప్రేమను నటించుచు, నాయకునితో భోగించుచుఁ దానును నానందపడుచున్నది. (పణ్యస్త్రియో హి ధనలోభేన పరరత్యర్థం రతాది విపంచయంత్యః కదాచిత్స్వయమపి పరాం రతి మనుభవంతి). తనది కపటప్రేమ యని తెలియనివిధమునఁ బణ్యాంగన తన విటునిఁ జుంబనాదులచేఁ జొక్కించుచు విటుఁ డొనర్చు స్తనమర్దన, చుంబన, కళాస్పర్శ, అధరా స్వాదములచేఁ గరఁగి వాని నానందపఱచుచున్నది. ఆనందపఱపనిచో నర్థము లభింపదు గదా! కాఁబట్టి సామాన్యా శృంగారముగూడ రసమే యగుచున్నది. అయితే యది యర్ధశృంగారము, మధ్యమశృంగారము.

కావుననే యాలంకారికులు పరకీయా సామాన్యానాయికాశ్రయ మగు శృంగారముగల భాణమును గూడ దశవిధరూపకములలో గణించిరి. దానినిఁ దుచ్ఛమనికానీ రసాభాసమనికానీ త్రోసివేయ లేదు. సాహిత్య దర్పణమునందు భాణలక్షణమున "సూచయేద్వీర

శృంగారా" అని కలదు. వీరశ్శృంగారము లనియే కాని తదాభాసము లని తెలుపలేదు. భర్తృహరి——

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ
బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్ ;
తమకార్యంబు ఘటించుచుం బర
హితార్థవ్యాపృతుల్ మధ్యముల్ ;
తమకై యన్యహితార్థఘాతుకజనుల్
దైత్యుల్; వృథాన్యార్థభం
గముఁ గావించెడివార లెవ్వరో ?
యెఱుంగన్ శక్యమే యేరికిన్ ?

అని లోకములోని జనులను సజ్జనులు(ఉత్తములు), మధ్యములు, దైత్యులు (అధములు) అని విభజించియున్నాఁడు గదా ! ఉత్తములను మాత్రమే మనము గ్రహించినచో లోకమునఁ గోటి కొక్కఁడేని నుండునో యుండఁడో ? అంతకన్న మధ్యములు గొందఱుందురు. అధములు పెక్కండ్రు. అధమాధములు లక్షోపలక్షలు. ఇందొకటి రెండు తరగతుల వారియువురును బూజ్యులే. వారలకుఁ గుడియెడమ లకువలెనే యలంతి భేదము పందెములలో నొకటి రెండు తరగతుల వారి కల్పభేదముతో బహుమాన మొసఁగుదురు. పరీక్షలలో నొకటి రెండు తరగతులలో నుత్తీర్ణులయినవారి కుద్యోగము లిత్తురు. కావున నిచ్చటఁ గూడ రెండవ తరగతికిఁ జెందిన మధ్యమశ్శృంగార ముపాదేయమే.

"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః"

మిగిలిన రసములకన్న శృంగారరసము మధురము; పరమాహ్లాదకరము. ఏలన నది ప్రాణులకు నిత్యానుభవములో నున్నది. కావున శీఘ్రముగాఁ జర్వ్యమాణమగును. మిగిలిన రసము లట్లుగావు. కావుననే యెల్లరికినిఁ ద్వరగా ననుభవమునకు రానిదియుఁ దద్విరుద్ధమును నగు

శాంతరసమును నాస్వాదించుటకు శృంగారరసాంగములను ప్రయో గించుచున్నారు. దీనిని ధ్వనికారుఁ డివ్విధమునఁ దెలిపెను.

"వినేయా నున్ముఖీకర్తుం కావ్య శోభార్థమేవ వా
తద్వరుద్ధరసస్పర్శ స్తదంగానాం న దుష్యతి."

"కించ శృంగారస్య సకలజన మనోఽభిరామత్వాత్ తదంగ సమావేశః కావ్యశోభాతిశయం పుష్ణాతి ఇత్యనేనాఽపి ప్రకారేణ విరోధిరసే శృంగారాంగసమావేశో న విరోధీ."

ఇట్లే బృహదారణ్యకమున సాధారణముగా ననుభూతి కందని బ్రహ్మానందమున కుపమానముగా సంభోగానందము చెప్పఁబడినది.

"తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమేవ। అయంపురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరం."

భోజుఁడును "ఏకో రస శృంగారః" అని శృంగారమొక్కటే రసమని యుద్ఘాటించెను. కేవలము సంస్కృత సాహిత్యముననేకాదు, ప్రపంచమునందలి సారస్వతము లన్నింటియందును శృంగార కావ్యములే యధికము. వీనిలో నుత్తమ, మధ్యమ, అధమత లుండవచ్చును.

ఈ శృంగార రసపోషణమున సంస్కృతమున నేమి ? ఇతర భాషలయందేమి ? కవులు స్వేచ్ఛగాఁ గచకుచాది వర్ణనములు విస్తారముగానే యొనర్చిరి. శాకుంతలమున మహాకవి కాళిదాసు ప్రియంవద నోట"పయోధర విస్తారయితృక మాత్మనో యౌవన ముపాలభస్వ" అని యనిపించెను. మేఘ సందేశమున "జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః"అనెను. కుమారసంభవమునఁ బార్వతీ పరమేశ్వరుల సంభోగమును వర్ణించెను. శాకుంతలమున మట్టమధ్యాహ్నమున శకుంతలా దుష్యంతుల సమావేశమును గల్పించెను. మహాభారతమున,

అయం స రశనోత్కర్షీ పీన స్తనవిమర్దనః
నాభ్యూరు జఘన స్పర్శీ నీవీవిస్రంసనః కరః.

అని యుద్ధభూమియందుఁ బడియున్న భూరిశ్రవసుని హస్తమును గాంచి, వాని భార్య విలపించినది.

లక్ష్మణాచార్య కవి "చండీ కుచ పంచాశికా" అను దేవీ కుచ వర్ణన కావ్యమును రచించెను. మహాభక్తుఁడగు పోతన్నగారు భాగవత దశమ స్కంధమున శ్రీకృష్ణుని లీలల నిట్లు వర్ణించిరి :

క. "వెన్నఁ దినఁగఁ బొడఁగని మా
పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికి దివియం
జన్నొడిసి పట్టి చీరెను ;
జిన్ని కుమారుండె యితఁడు శీతాంశుముఖీ !

క. తలఁగినదానం దలమనఁ
దలఁగక యీ చెలికి నాన దలయెత్తఁగ నీ
తలఁగిన చోశెయ్యది యని
తల యూఁచెను నీ సుతుండు దగవె ? మృగాక్షీ !

క. తెఱవ యొకతె నిద్రింపఁగ
నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నేటగు తేలుం
గఱపించి నీ కుమారుఁడు
వెఱచుచు నది పఱవ నగియె విహితమె ? సాధ్వీ !

క. నా కొడుకును నా కోడలు
నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ
గూకలిడెన్ నీ సుతుండు గుణమె గుణాఢ్యా !"

ఇట్లు కవులేకాదు, కవయిత్రులును గవులను మించి వర్ణనములు నేసిరి. చూడుఁడు :

సీ. శృంగార యౌవన క్షీరాబ్ధి నడుమను
దనరారు బంగారుఁదమ్మి యనఁగ

దళుకుమించన మించు తనుచంద్రరేఖలోఁ
బరిఢవిల్లు కురంగపద మనంగఁ
గలదులేదనునట్టి కౌనుదీవియయందుఁ
బూచిన దింౘెనపూవనంగ
నలువొందు నాభిపున్నాగంబునను బుట్టి
ప్రవహించు విరిదేనెవాఁక యనఁగఁ
గీ. జొక్కి మరులెత్తి మెత్తలఁ జుట్టి చూడ
నజుఁ డొనర్చిన మోహనయంత్ర మనఁగ
మరులుగొలిపెడి దొరసాని మరునియిల్లు
కళలు గరఁగంగ ముద్దాడి కలియు టెపుడొ ?

ముద్దుపళని రాధికాసాంత్వనము. 101 పుట.

'వికటనితంబ' అను కవయిత్రి రచించిన యీ క్రింది శ్లోకమును గనుఁడు.

శ్లో. కాంతే తల్ప ముపాగతే విగళితా నీవీ స్వయం బంధనాత్ ;
వాసో విశ్లథ మేఖలాగుణధృతం కించి న్నితంబే స్థితం ;
ఏతావ త్సఖి ! వేద్మి సాంప్రత మహం ; తస్యాంగసంగే పునః
కోఽయం ? కాఽస్మి ? రతం ను వా కథ ? మితి స్వల్పాపి మే
న స్మృతిః.

ఈ యర్థమే కొంత గల శ్లోకము సాహిత్యదర్పణమునఁ గలదు.

"ధన్యాఽసి యా కథయసి ప్రియసంగమేఽపి
విస్రబ్ధ చాటుకశతాని రతాంతరేషు
నీవీం ప్రతి ప్రణిహితే తు కరే ప్రియేణ
సఖ్య ! శ్శపామి యది కించిదపి స్మరామి."

సంస్కృతమున నొక కవి గుహ్యాంగకేశములు వర్ణించెను.

గౌరముగ్ధవనితావరాంగకే
రేజు రుత్థిత తనూరుహాంకురాః

తర్పణాయ మదనస్య వేధసా
స్వర్ణ శుక్తి నిహితా స్తిలా ఇవ.

శృంగారనైషధమున శ్రీనాథుఁడు గుహ్యాంగమును వర్ణించెను :

శా. ఏదే నొక్క మనోహరాంగకముచే నీ యిందుబింబాస్య హే
లా దర్పంబునఁ బిప్పలచ్ఛదము గెల్వంగాఁ దలంచెం జుమీ !
లేదే నన్య మహీజపత్త్రిములఁ బోలెంగాక యేలా ! భయ
ప్రాదుర్భావమునం జలించు నది నిర్వాత ప్రదేశంబునన్.

ఇట్లు సంస్కృతాంధ్రకవు లెల్లరును స్వేచ్ఛగాఁ బైవిధమునఁ దత్తదవయవములను, సంభోగమును ( రతి - ఉపరతి - బంధములు ) వర్ణించిరి. ఇట్లు మన భాషలోనేకాదు, ప్రపంచము నందలి యెల్ల భాషలలోను గలదు.

ఇట్టివానినిఁ జూచి నేఁటి పాశ్చాత్య విద్యాశాలు రాంగ్లమున నిట్టి గూఢాంగ వర్ణనములు, రతి వర్ణనము మొదలగునవి లేవనియు, మన కవులకు సభ్యత తెలియదనియు మన శృంగార గ్రంథములను, దత్కవులను నిందించుచున్నారు. ఆంగ్లమున గూఢాంగ వర్ణనములు లేకపోలేదు. షేక్స్పియర్ మహాకవి ప్రభృతులే చేసిరి. వాని నెత్తి పిమ్మటఁ జూపుదును. కానీ మన కావ్యములలో నున్నంత విస్తృత వర్ణనములు వారి కావ్యములలో లేకపోవచ్చును. దీనికిఁ గారణ మేమైయుండునో మనము విచారింతము. కేవలము వారట్టి వర్ణనము

"........అందుచేత అట్టి కవితలను (శృంగార కవితలను) తిట్టిపోయరాదు. షేక్స్పియరు కన్న పచ్చి పచ్చి పద్యాలు వ్రాసిన కవి ఇంగ్లీషులోనే లేఁడు. కానీ ఇంగ్లీషువారు తమ షేక్స్పియరును కవిలోకమూర్ధన్యునిగా గౌరవించుటలేదా ? కందుకూరి వీరేశలింగముగారు మొదట పచ్చి శృంగారాన్ని నిందింపమొదలుపెట్టిరి. ఆనాఁటి నుండి గతానుగతికముగా ఆంధ్రలోకము శృంగారాధిక్యత గల కవితలను మడివారు మైలవారిని 'గచ్ఛ దూరం' అన్నట్లుగా నిందిస్తున్నది. ఆ ధోరణిలో గొంతైనా మార్పురావలెను."

— ఆంధ్ర సాహిత్య చరిత్ర పీఠిక (సురవరము ప్రతాపరెడ్డి)

లసభ్యములని వదలిరా ? అట్లేని సాంగ్ల నాటక ప్రదర్శనములలోఁ బరస్పరాలింగన చుంబనాదు లేల చేసికొందురు ? అవి యసభ్యములు గావోటు ? పరస్త్రీలు పరపురుషులతో రంగముల లాస్యమాడుదురు. అపుడు కచకుచాది స్పర్శలు కలుగుచుండుట వలన నసభ్యత లేదేమో ?

లెస్సగా విచారింపఁగా నా కీ యూహ తట్టుచున్నది. పాశ్చాత్య దేశము శీతలదేశము. కావున వా రెప్పుడును శరీరమును దట్టముగా వస్త్రములచే నాచ్ఛాదించుకొందురు. మన దేశమున నట్లు గాదు. మన దేశమున మొదటినుండియు నుల్లిపొరవంటి సన్ననిచీరలు (మజిలినులు- వీనినే జిలుఁగులు, వలిపెములు అని వ్యవహరించిరి.) ఎల్లరుగాకున్నను గొందఱైనను నందక త్తెలు దాల్చువారు. కావునఁ గుచ- ఊర్వాది భాగములు గొంత కొంత సన్నని యా చీరలలోనుండి కానఁబడు చుండెడివి. మనకవులు పెక్కండ్రు రాజాస్థానములలో నుండెడివారు. అచ్చటి యంతఃపుర కాంతలయు, వారి దాసీజనము యొక్కయు సౌందర్యములు చూచి వర్ణించెడివారు.

దీని కవష్టంభకముగా నాకొక విషయమగపడినది. "హర విలాస శారదా" వ్రాసిన "హిందువుల అధిక్యము" (Hindu Superiority) అను గ్రంథమున ౯౧౨ పుటలో నిట్లు గలదు. "Cotton Manufacturers of Decca" అను పుస్తకమున 'Batt' అను నాంగ్లేయుఁడు "ఔరంగజేబు ఒక పర్యాయము దన కుమార్తెను దుస్తులలోనుండి యొడలు కనిపించుచున్నదని చీవాట్లు పెట్టినాఁడఁట. ఆమెయు ఏడుపొరలు త్రిప్పి కట్టుకొంటిననియు తన తప్పేమియు లేనట్లు సమాధానము చెప్పెనట" అని వ్రాసెను. మరియు నదే పుటలో నిట్లు గలదు. గౌతమబుద్ధుఁడొకపర్యాయము 'గంగద్దామో' అనునామె పూర్తిగా మజిలిను ధరించియుండఁగా 'వస్త్రహీన' అని యనుకొనెనఁట. నాఁటఁగోలె బుద్ధుడు ధర్మనిష్ఠగల ఆడువారెవ్వరును సన్నని మజిలిను ధరింపరాదని నిషేధించెను."

కావున సన్నని మజిలినులు ధరించిన సుందరాంగుల యవయవములు గోచరించుననుట నిస్సంశయముగదా !

ఇంతేకాక వస్త్రధారణమునఁ బూర్వపద్ధతికినిఁ నాధునిక పద్ధతికినిఁ జాలభేదము గలదు. ఆనాఁటి యువతులు నాభి గోచరించునట్లు చీరలు దాల్చువారు. అప్పుడు కటీ, వళీ, రోమావళీ, జఘన అవలగ్నాదులు స్పష్టముగాఁ గానఁబడును. పూర్వాధర కాయముల కేకవస్త్రముగాక యధరకాయమున కొకవస్త్రమును బూర్వకాయమునకు విడిగా నుత్తరీయమును బయ్యెదగా ధరించెడివారు. కక్షమూలములు గోచరించు విధమునఁ జనుకట్టు దాల్చువారు. "ద్రావిడీస్తనగతిఁ దేటగాక" అన్నట్లు కొందఱు చనుకట్టునుగూడ ధరించెడివారు గారు.* ఇట్టి వస్త్రధారణమువలన సుందరాంగుల సర్వాంగలావణ్యము స్పష్టముగా గోచరించును. కవు లిట్టి యువతులను గాంచి రసికులుగానఁ బ్రభువులను మెప్పించుటకై తత్తద్వర్ణనములు సేసిరి. ఇంతేకాదు. "రవిగాననిచోఁ గవి గానకుండునే?" అని యున్నదిగదా? కవి నేత్రములకు గోచరింపని దేమున్నది ?

ఆంగ్లకవులుగూడ గూఢాంగ వర్ణనములు సంభోగ వర్ణనములును జేసిరని పైనిఁ జెప్పితిని చూడుఁడు.

*ప్రాచీనకాలమునఁ దెలుఁగువారికిఁ బైఁటలులేవు. అవి మహారాష్ట్ర ఘూర్జరుల సంబంధమున అప్పటి ఆంధ్ర రాజధానియయిన ప్రతిష్ఠానము (పైఠాన్) నుండి నాగరకతతో వ్యాపించినవి. పైఠాన్ పదభవమే పైఁట. ఆంధ్రస్త్రీ వర్ణనమున సాతవాహన సప్తశతిలోను, ఇతర సంస్కృత కావ్యములందును, కుచ సౌభాగ్యము ప్రధానముగా వర్ణితమగును.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'తెలుఁగు మెఱుఁగులు' పుట ౨

సీ. ముడువంగనేర్తురు మూలదాఁపటికిరాఁ జికురబంధములీఁగ జీరువాఱ

గీ. పయ్యెదయు, సిగ్గుఁ జాలిండ్లఁ బ్రాఁకనీరు
కంచియఱవత లసమాస్త్రి ఖడ్గలతలు.

—కాశీఖండము.

"Her paps are centers of delight
Her breasts are orbs of heavenly frame
... ... ... ... ...
Heigh Ho ! would she be mine."

—*Thoms Lodge.*

ఈ పద్యమున స్త్రీ నఖశిఖాంతవర్ణనము గలదు.

"Light feet, dark violet eyes and parted hair
Soft dimpled hands, white neck and creamy breasts."

—*Keets.*

"Her cheeks like apples which the sun has ruddened
... ... ... ... ... ... ...
"Her paps lyke lyllies budded."

—*Spencer.*

"With arms around my waist he drew me to his waist,
And burning kisses on my cheeks and lips impressed,
There as he caught me returning them though feebly
He placed his hands on breast and pressed them gently,
Blushing in shame back and pushed him aside,
But un-abashed he caught me up again and smiled.
While pressing sweet kisses on my lips and eyes,
The shy rogue so deftly put his hands between my thies"

—Bride's Conception : *Lord Byron.*

"I'll be a park and thou shall be my deer,
Feed where thou wilt on mountains or in dale,
Graze on my lips and if those hills be dry,
Stray Lower, where the pleasant fountains lie,
Within this limit is relief enough,
Sweet bottom grass and high delightful plain,
Round rising hillocks, brekes obscure and rough
To shelter thee from tempest and from rain
Though the my deer ! since I am such a park
No-body shall rouse thee though a thousand bark.

—Venus and Adonis : *Shakespeare.*

అసలు మరొక రహస్యము గలదు. మన భారతీయులకుఁ దెలిసినంత శృంగార వైవిధ్యము పాశ్చాత్యులకుఁ దెలియదు. చూడుఁడు. మనకవులవలె వారు రతి, ఉపరతి, బంధములు, జలక్రీడలు, పుష్పాపచయములు, వసంతోత్సవములు, కౌముదీమహోత్సవములు, డోలాక్రీడలు మొదలగువానిని వర్ణింపరైరి. ఏల? వారి కవి యను భూతములు గావు గదా! మరియు శుక, పికాలాప; మలయానిల,

---

*"The East from the immemorial past has handed down invaluable instruction in the art of love. This their wise men have taught as the most important branch of education. In consequence of this complex study of the body of the men and women Eastreners scientifically leant how to rise to heights of pleasure rarely attained by the comparatively ignorant Westerners.

Our Western civilization approaches woman like animals in heart, with hardly more than an animal comprehension of the anatomy and human refinements. And yet the West has upto very recently considered their ignorant approach as superior. The tragic consequences of the ignorance are but now being realised and the Art of Love is permitted to be taught to a certain extent, despite the rebellian of hypocrites and idiotic reformers.

Out side individual cases of extra-ordinary temperament, the passion is even more a matter of knowledge than of degree. The Hindus have rich treasury of classical works of Erotology that gives detailed and scientific instruction in the art of love; they tell of an infinite variety of refinements of physical love; how to increase pleasure and verility, and caution against pit-falls of sex."

Paolo Mantegazza,
Professor of Anthoropology,
University of Florence.

—(Dr. B. N. Basu ఆంగ్లీకరించిన కామసూత్రమునకు వ్రాసిన తొలిపలుకు).

"Havelock Ellis comments upon the oriental art of love and acknowledges frankly the superiority of the Indian art of love over the Europen and Westren art of love, whether ancient or Modern. He quotes Vatsyayana, the greatest Indian authority on Sex, and says, "The old Hindu erotic writer attributed great importance alike to the man's attentiveness to the woman's erotic needs, and to his skill and consideration in all the preliminaries of the sexual act."

"The Physical side of the love" page-31.

చంద్రాదులు శృంగార రసోద్దీపక సామగ్రిగాఁ గవిసమయములుగా మనవారు గ్రహించినట్లు వారు గ్రహింపరు. మన మత సాంఘికాచారములు వారికి లేవుగదా!

మన శీతోష్ణ పరిస్థితులు వేఱు. స్త్రీ పురుష జాతిభేదములు, ముగ్ధాదిభేదములు, అష్టవిధ నాయికా భేదములు, వారి యవస్థా భేదములు, నాయక భేదములు, శృంగారావస్థలు మొదలగునవి వారికి లేవు. ప్రౌఢనాయికలగు ఖండితాదుల వక్రోక్తులు, ప్రణయకోపములు, పాంథనాయికా సంభాషణములు, ప్రపాపాలికా పుష్పలావికాదులతోడి గోష్ఠులు వారికి లేవు. ఇదంతయు శృంగార రసోపబృంహక సామగ్రి కదా! వారికింత సామగ్రి యేది? కావుననే వారి కావ్యములందలి శృంగారము మన కావ్యములందలి శృంగారమువలె నంత యాస్వాద్యముగా నుండదు. వారి కధరచుంబనమే తెలియును. కానీ యధరాస్వాదము, దానిచేఁగలుగు సుఖాతిరేకమును వారికిఁ దెలియదు.

* "In classical Sanskrit the moon is considered as an enhancing agent (ఉద్దీపన విభావ) in love sentiment. Contrary to this, Shakespeare takes the moon as having power of suppressing erotic passion.

"That very time I saw, —but thou couldst not—
Flying between the cold moon and the earth,
Cupid all arm'd : a certain aim he took,
At a fair restal, throned by the mest,
And loos'd his love shaft smartly from his bow,
As it should pierce a hundred thousand hearts;
But I might see young cupid's fiery shaft
Queneh'd in the chaste beams of the watery moon;
And the imperial votaress passed on
In maiden meditation, fancy free."

So also the southern wind (మలయమారుత) is attributted to be a slow runner, where as Goldsmith takes that wind as a fleeting one.

"Till more unsteady than the southern gale
Commence on other shores displayed her sail."

"Educational Review" Madras, January, 1947.

"Theory of Dhwani" in Sanskrit poetry by Sri Gunde Row, Vachaspati, Siromani and District Judge, Gadwal State.

"కామినా మధరాస్వాద స్సురతా దతిరిచ్యతే" అని మన భారతీయు లన్నారు. ఇంతేకాదు, భారతీయులకుఁ దెలిసిన కామకళా రహస్యము లెన్నో పాశ్చాత్యులకుఁ దెలియవు పురుషుని కన్న స్త్రీకే సురత సుఖాధిక్యము, కామాధిక్యము, అనురహస్యము, స్త్రీ పురుష జాతి భేదములు, సమరత, నీచరత, ఉచ్చరతాది భేదములు, భిన్నజాతీయు లగు (శశ, పద్మిన్యాది) నాయికా నాయకుల కుచితములగు బంధ విశేషములును వారికి బొత్తుగాఁ దెలియవు.

ఊర్ధ్వరేతస్కులై యణిమాది సిద్ధులు సాధించుటయం దెంత గండంద్రో మన భారతీయులు రతి, ఉపరతి, బంధంబులయందును నంత గండంద్రే. కనుఁడు ;

"ఏకవారావధిర్యామో రతస్య పరమో మతః
చండశక్తిమతోర్యూనో రద్భుత క్రమవర్తినోః"

అని రతి సర్వస్వమున నొకతూరి రతికి యామకాలము (3 గంటలు) అవధిగాఁ జెప్పఁబడినది. దీని కవష్టంభకముగా మేఘసందేశమున

"తస్మిన్ కాలే జలద! యది సా లబ్ధ నిద్రాసుఖా స్యా
దన్వాస్యైనాం స్తనితవిముఖో యామమాత్రం సహస్వ"

అనుచోట "శక్తయో రేకవారసురతస్య యామావధికత్వాత్ స్వప్నేఽపి తథా భవితవ్యం ఇత్యభిప్రాయః" అని మల్లినాథ వ్యాఖ్య. ఇంతతడవు రేతః స్తంభము సేయువాఁడు ద్రఢిష్ఠుఁడు బలిష్ఠుఁడును గావలయును, ఈ కాలమునఁ బెక్కండ్రు స్త్రీ స్పర్శమాత్రముననే రేతఃపాతమును బొందుదురు. దీనినిఁ బట్టిచూడఁగాఁ బ్రకృత కాలమున మనము మోక్షానందమున కెంత దౌలనుంటిమో గృహస్థాశ్రమమునం దున్నను సంభోగానందము యొక్క పరమావధి (యామకాలావధి) కంత దౌలనే యుంటిమి. వేదాంత సూత్రములను రచించి మోక్ష స్వరూపము దెలిపిన వ్యాసుఁ డెంత పూజ్యుఁడో, కామ పురుషార్థ స్వరూపమును నామూలాగ్రముగాఁ దెలిపిన వాత్స్యాయనుఁడును

నంత పూజ్యుఁడే. ఆ యా పురుషార్థ నిర్వహణమున కాయా శాస్త్రములను జదువవలసినదే, కావున నుత్తమ దాంపత్యసుఖ మభిలషించు యువతీయువకు లెల్లరును గామశాస్త్రమును దప్పక చదువవలయును. ఈ క్రింది శ్లోకములు రతిశాస్త్ర పఠనావశ్యకతను జాటుచున్నవి.

"రతిశాస్త్ర పరిజ్ఞాన విహీనా యే నరాధమాః
శ్వానవత్తు రతిస్తేషా న రతే స్సుఖమశ్నుతే ;
రతేస్సుఖస్య జ్ఞానార్థం రతిశాస్త్రం సమభ్యసేత్ ;
జ్ఞాత్వా కర్మాణి కుర్వీత తత్రానందో భవేద్ధ్రువమ్ ;
అన్యథా పశువత్తేషాం రతికర్మ సునిష్ఫలం ;
నచానందో నచ సుఖం దుఃఖస్యైవతు కారణం ;
దాంపత్య సుఖసిద్ధ్యర్థం కామశాస్త్రం సమభ్యసేత్
తదభ్యాసా దనిర్వాచ్య మమందానంద మశ్నుతే."

అనంగరంగ పీఠిక

మరియు

జాతి, స్వభావ, గుణ, దేశజ, ధర్మ, చేష్టా
భావేంగితేషు వికలో రతితంత్రమూఢః
లబ్ధ్వాఽపి హి స్ఖలతి యౌవన మంగనానాం
కిం నారికేళఫల మాప్య కపిః కరోతి ?

అనంగరంగ పీఠిక.

అనియును గలదు. ఈ కామశాస్త్రమును స్త్రీలు యౌవనారంభమునకు ముందే యభ్యసింపవలయునని వాత్స్యాయనుఁడు,

"ప్రాగ్యౌవనాత్" ౧. ౩. ౨.

అను సూత్రమునఁ దెలిపెను. మరియు,

"ప్రత్తాచ పత్యురభిప్రాయాత్ ౧. ౩. ౩.

అను సూత్రమునఁ బెండ్లైనపిమ్మట పతి యనుమతితో నభ్యసింపవలెనని తెలిపెను. మరియు,

"తస్మాద్వైశ్వాసికాత్ జనా ద్రహసి ప్రయోగాన్ శాస్త్రమేక దేశం వా స్త్రీ గృహ్ణీయాత్"                    ౧. ౩. ౧౩.

విశ్వసనీయులగు వారినుండి యువతి రహస్యముగా రతి ప్రయోగములును, వీలున్నచో సంపూర్ణశాస్త్రమును లేకున్నచో శాస్త్రైకదేశమునైన నుపదేశ మొందవలెను. అనియు,

"అభ్యాస ప్రయోజ్యాంశ్చ చతుష్షష్టికాన్ యోగాన్ కన్యా రహస్యేకాకి న్యభ్యసేత్.

కొన్ని రహస్యములను గన్య రహస్యముగా నొంటరిగా నభ్యసింప వలెను. అవియు,

"ఆచార్యాస్తు కన్యానాం ప్రవృత్త పురుష సంప్రయోగా, సహసంప్రవృత్తా ధాత్రేయికా, తథాభూతా వా నిరత్యయ సంభాషణా సఖీ, సవయాశ్చ మాతృష్వసా, విస్రబ్ధా, తత్థ్సానీయా వృద్ధదాసీ, పూర్వ సంసృష్టా వా భిక్షుకీ, స్వసాచ విశ్వాస ప్రయోగాత్."
                                        ౧. ౩. ౧౫.

పురుష సుఖమును జూఱగొన్న తన దాది కూఁతురు గానీ, అట్టి చెలికత్తె గానీ, అట్టి పినతల్లి గానీ, తన యింటి వృద్ధదాసి గానీ, పురుష సంపర్కము ముందెఱిఁగిన భిక్షుకి గానీ, అక్కగానీ కన్యలకు రతి రహస్యములు దెలుపఁదగినవారనియు వచించెను.

పూర్వకాలమున నిషేకమునాఁడు కన్యకకుఁ దల్లియో, అక్కగారో కొలఁదిగా నుపదేశించి గదికిఁ బంపువారు. కాని యంతమాత్రమున రతి రహస్యములు సమగ్రముగాఁ దెలియఁబడవు.

ఈ కాలమునఁ గామశాస్త్రపఠనము లేకపోవుటవలననే మనము సంపూర్ణమయిన సంభోగానందమును బొందలేకున్నాము. కావున నా గ్రంథమును జదువవలయును. వైద్యశాస్త్ర మభ్యసించు విద్యార్థులకును, విద్యార్థినులకును శరీరశాస్త్ర రహస్యములను నేర్పినట్లే ప్రాయమును బొందుచున్న యువతీ యువకులకుఁ గామశాస్త్ర

విషయములను నేర్పవలెను. వాత్స్యాయనుఁడు విశ్వసనీయుల వలన నేర్చుకొనవలెననియెను. విశ్వసనీయులు లభింపకపోవచ్చును. తగిన గ్రంథములను జిత్రపటములతోఁ బ్రచురింపవలెను. అట్టి వానినిఁ బ్రభుత్వము నిషేధింపరాదు.

కామశాస్త్రపఠనము వలన యువతీయువకుల చరితము దూషిత మగునని శంకింపరాదు. కొంతకాలము క్రిందటివఱకు స్త్రీలు విద్య నభ్యసించినచోఁ జెడిపోవుదురని మన తాత ముత్తాతలు శంకించెడి వారు. ఆడుబిడ్డలకుఁ జదువుఁ జెప్పించెడివారుగారు. నేఁటి కాలమున నట్లు గాదుకదా! చదువుకొన్న స్త్రీ చక్కఁగా సంసారమును దిద్దు కొనుననియు, లోకమునకుఁ గూడ సేవ సేయుననియు నేఁటివారు నమ్ముచున్నారు. ఆడుబిడ్డలను జదివించుచున్నారు. వారు చరిత్ర దూషితము గాకుండనే కులమర్యాద గలిగి మెలఁగుచున్నారు గదా! స్త్రీల కట్టు, బొట్టు, జుట్టులలో నెంతో భేదము నేఁడగపడుచున్నది. దానిచే వారి చరిత్ర దూషితమగుచున్నదా? అట్లే కామశాస్త్ర పఠనము వలన యువతీయువకులు కామపురుషార్థము యొక్క పరా కాష్ఠను రుచిఁజూచి దాంపత్య ఫలమును బొందఁగలరు. దీనిచేఁ బాతి వ్రత్యమునకు భంగము వాటిల్లదు. దైవభక్తి నశింపదు. మొదట మొదట నీ కామశాస్త్ర పాఠకులను బరిహాసించువారున్నను, క్రమముగా వారలు దాని పఠనావశ్యకతను గ్రహింపఁగలరు. శంకరుని వంటివాఁడు గామశాస్త్ర రహస్యములను దెలిసికొనుటకై పరకాయ ప్రవేశము సేసెనని యితిహాసము గలదుగదా!

కొంతకాలము క్రిందట నాటకములలోఁ బాత్రలై యభిన యించువారిని సంఘము చాల నీచముగాఁ జూచెడిది. "వాఁడు నాటకాల్లో కలిసిపోయినాఁడు" అని నిందగా వచించెడివారు. కులస్త్రీ లెవ్వరును నాటకములలోఁ బాల్గొనువారు గారు. అది చాల దూష్యము. కానీ నేఁడో కళోద్ధరణము పేరితోఁ గులస్త్రీలును

నాటకములలోఁ సినిమాలలో, భరతనాట్యములలో బాల్గొనుచున్నారు. దేవిపదముతో గౌరవింపఁబడుచున్నారు. సన్మానపత్త్రిము లందుకొనుచున్నారు. ఈ వ్యవహారముచే వారి చరిత్రము దూషితము కానట్లే కామశాస్త్ర పఠనమువలనను జరిత్ర దూషితముగాదు,

మరొక ముఖ్యవిషయము : కామశాస్త్రమును జదివిన యువతీయువకులు తామేజాతి (పద్మిన్యాది - శశాది) వారలో యెఱిఁగి వారి కుచితములగు *రతిబంధములచేఁ గ్రీడించి యానందింతురు. అట్లు చదువనిచో నా యా బంధములు దెలియమిచే సంభోగానందమును బొందఁజాలరు. సంభోగానందము గలుగుచున్నచోఁ బరస్పర మోహ మధికమగును. లేకున్న దగ్గును. అంతట వారిరువురును బరస్పరము ప్రీతిగలుగుట లేదని యభిసారమును నభిలషింతురు. సంఘభీతిచే నభిసారమునకు సాహసింపకున్నను మనోఽభిసరణమునైనను జేయుదురు. ఇట్టివారి నెందరినో మనము నేఁడు చూచుచున్నాము. కావున యువతీయువకులు గామశాస్త్ర రహస్యములను బఠించి పరస్పరావర్జకములగు క్రీడలను దెలిసికొనవలయును.

మరియు దంపతులలో నొకరు స్థూలముగా నొకరు సన్నముగా నుండవచ్చును ఒకరు పొట్టిగా నొకరు పొడవుగా నుండవచ్చును.

---

*'The Mysteries of Sex' అను గ్రంథముయొక్క 79, 80 పుటలలో నాయా బంధము లెట్టివారి కుచితములోఁ దెలుపఁబడినది. ఈ బంధములు హిందూ, ఈజిప్టు, మహమ్మదీయులకే కాని యాంగ్లేయులకుఁ దెలియవు. వీరిలోఁ గూడా నీ బంధసంఖ్య హిందువులకుఁ దెలిసినంత యితరులకుఁ దెలియవు. హిందువుల బంధములు చౌసీతి(84).

ఈ క్రింది విషయము గూడ దీని కవష్టంభకము.

*"The variations in coitus are not at all due to vicious taste or unnatural sexual instinct. They are often necessary either for rectifying the anotimical defects in the genetals or for calling forth the latent sexual feeling in the partners or for discovering the most proper, the most healthy and the most delightful method of coitus in order to establish and maintain the real happiness of married life."

Page 36 (The Physical side of Love).

వారి వారి కనుకూల క్రీడలను దెలిసికొనవలయును. గర్భవతిగా నున్నపు డెట్టి క్రీడ లనర్థములో తెలిసికొనవలయును. దంపతులు భిన్న దేశీయులగుచో వారి యభీష్ట క్రీడ తెలుఁగవలయును. మరియు బరస్పర మోహాభివర్ధక సాధనము లెన్నో తెలిసి యుండవలెను. ఇవన్నియుఁ గామశాస్త్రమువలన నెఱిఁగి యువతీ యువకులు ననుభవింపవలయును. మన పూర్వులకీ కామకళారహస్యములన్నియు క్షుణ్ణముగాఁ దెలిసియుండెను. వారు నానారతి బంధములతో గ్రీడించెడివారు. వాత్స్యాయనుఁడా కాలమున సంఘమున వ్యాప్తిలో నున్న కామకళారహస్యములనే గ్రంథము సేసియుండెను. ఈనాఁడు మనవలెఁ బ్రాచీనులు గామశాస్త్రరహస్యములకు దూరులుగారు. కావుననే మన భారతీయ వాఙ్మయమున శృంగారవైవిధ్యమున్నంత పాశ్చాత్య వాఙ్మయమునలేదు.

మన భారతీయ కవులు చేసినట్లు స్త్రీ వర్ణనమును పాశ్చాత్యులు సేయరైరి. మనవారికిఁ దెలిసినంత లావణ్యరహస్యము వారికిఁ దెలియదు. మన కవులు స్త్రీయొక్క యవయవముల కుపమానము లుగా గ్రహించిన యాయా వస్తువుల గుణములను బరికించినచో నీవిషయము దెల్లమగును. ఉపమాన మప్రత్యక్షవస్తువును బ్రత్యక్ష ముగాఁ జేయునుగదా! ముఖము చంద్రునివలె నన్నదనఁగా నా స్త్రీయొక్క ముఖసౌందర్యమును మనము చూడకున్నను మన కన్నులయెదుటఁ బ్రత్యక్షమగును. స్తనములు దబ్బపండ్లవలె నున్న వనఁగానే వాని గుండ్రతనము, వాని పరిమాణము, వాని బంగారు కాంతియును బ్రత్యక్షమగును. ఈ విధముగా నప్రత్యక్షమయిన యువతియొక్క యాయా యవయవముల సౌందర్యమును స్ఫురింప జేయుటకై మన కవు లేయే యుపమానములను వాడిరో చూడుఁడు.

స్త్రీ — చంద్రకళా, విద్యుత్, తారా,
కనకలతా, రత్నకలా కాదు
లతోఁ బోల్పఁబడును

| | | | |
|---|---|---|---|
| ,, శరీరకాంతి | — | బంగారముతో | ,, |
| ,, శిరోజములు | — | తమస్సు, శైవాలము, బర్హి పింఛము, భ్రమరములు, చామరము మొ. వానితో | ,, |
| ,, వేణి | — | భృంగావళి, అసితో | ,, |
| ,, లలాటము | — | అర్ధచంద్ర, హేమపట్ట ములతో | ,, |
| ,, కనుబొమ్మలు | — | స్మరచాప, లతలతో | ,, |
| ,, కపోలములు | — | అద్దముతో | ,, |
| ,, ముఖము | — | చంద్ర పద్మములతో | ,, |
| ,, నాసిక | — | తిలపుష్పము, సంపెంగ మొగ్గలతో | ,, |
| ,, కంఠము | — | శంఖముతో | ,, |
| ,, నేత్రములు | — | తామర రేకులు, కలువ రేకులు, లేడి కన్నులు, కాటుక పిట్టలతో | ,, |
| ,, అధరము | — | పవడము, దొండపండులతో | ,, |
| ,, దంతములు | — | ముత్యాలకోవ, దాడిమ బీజములతో | ,, |
| ,, బాహువులు | — | మృణాళములు, తీవలతో | ,, |
| ,, కరములు | — | పద్మ, పల్లవములతో | ,, |
| ,, నఖములు | — | కుందకోరకములు, తారలతో | ,, |
| ,, స్తనములు | — | తమ్మిమొగ్గలు, తాళఫలములు, పూగుత్తులు, కరికుంభములు, చక్రవాకములు, దబ్బపండ్లు, బంతులు మొ.వానితో | ,, |

| | | |
|---|---|---|
| స్త్రీ వళులు | — తరంగములు,సోపానములతోఁబోల్పఁబడును. | |
| ,, నడుము | — ముష్టి గ్రాహ్యముగా, సూది | ,, |
| | మొన, శూన్యము, అణువు, | ,, |
| | సింహామధ్యము మొ. వానితో | ,, |
| ,, జఘనము | — పులినముతో | ,, |
| ,, నితంబము | — పీఠము, చక్రము, భూమి, | |
| | కనకశిల మొ.వానితో | ,, |
| ,, ఊరువులు | — కదళీ ప్రకాండము, కరి కర | |
| | ములు, కరభము మొ. వానితో | ,, |
| ,, చరణములు | — పల్లవ, పద్మములతో | ,, |
| ,, గమనము | — గజగమన, హంసగమనములతో | ,, |
| ,, కటాక్షము | — యమునా తరంగములు, | |
| | విషము, అమృతము మొ. వానితో | ,, |
| .. హాసము | — వెన్నెల, అమృతము, ఫేనము | |
| | మొ.వానితో | ,, |

వీనినిఁబట్టి చూచిన స్త్రీ గాత్రావయవము లెట్టున్న లోకోత్తర లావణ్యము గోచరించునో యీవిధముగా నుపమానములు గల్పింపఁ బడినట్లు తోఁచును. ముఖమునకు లోకములోఁ జంద్రుని కన్నఁ బద్మమున కన్న సుందరతరమైన యుపమానవస్తు వేది గలదు? ఇట్లే మిగిలిన యెడలను జూచినచో నీ యుపమానములు లోకోత్తర సౌందర్య స్ఫోరకములని తట్టును. పాశ్చాత్య వాఙ్మయమున నిట్టి యుపమానములు లేవు. ఒకటి రెం డెచటనేని నుండవచ్చును. కావుననే మన యీయుపమానకోటిచే స్త్రీలావణ్య మెంతగాఁ బ్రత్యక్షమగునో పాశ్చాత్యుల యుపమానములచే నంతగాఁ బ్రత్యక్షముగాదు. చూడుఁడు, ఆంగ్లకవులు (పూర్వోదాహృతులు) స్తనముల కుపమానములుగా creemy breasts, orbs of heavenly frame అను

వాని నిచ్చిరి. స్తనముల కుపమానములుగా మనవారిచ్చిన దబ్బపండ్లు, పసిఁడిగిండ్లు మొదలగువాని వంటివా యా యుపమానములు? స్తనములు దబ్బపండ్లవలె నున్నవనఁగానే స్తనముల వర్తులత్వము స్థూలత్వము, శరీరకాంతియును శ్రోతకుఁ బ్రత్యక్షమగును? ఆంగ్లోపమానములచే నట్లు గోచరింపవు. అట్లు గోచరించినఁ గానీ రసానుభూతి గలుగదు. మిగిలిన యుపమానముల యౌచిత్యము గూడా నిట్లే యూహింపవలెను.

ఇంతేకాదు మన భారతీయ కవులకుఁ గల సౌందర్య విమర్శ పాశ్చాత్యులకు లేదు. చూడుఁడు:

"సమస్తాపః కామం మనసిజ నిదాఘ ప్రసరయోః
నతు గ్రీష్మస్యైవం సుభగ మపరాద్ధం యువతిషు.

శాకుంతలము.

ఇటఁ గాళిదాస మహాకవి విరహతాప, నిదాఘతాప కార్యములకు భేదమెంత సూక్ష్మముగాఁ బరికించి చెప్పెనో! పైఁజూపిన యుపమానాదులవలనఁగూడా మన భారతీయ కవులకుఁగల సూక్ష్మదృష్టియు, నుపమానౌచిత్యమును బాశ్చాత్యకవులకు లేదనవలెను.

ఇప్పటి విద్యావతులగు యువతులు మన కావ్యములందలి స్త్రీ ప్రత్యంగ వర్ణనమునుబట్టి స్త్రీని నగ్నునుగాఁ జిత్రించి కొంచెపఱచుచున్నట్లును, స్త్రీనిఁ గేవలము భోగ్యవస్తువుగానే పురుషులు చేసికొన్నట్లును నిందించుచున్నారు. ఇది పొరపాటనక తప్పదు. ఒక సౌందర్యవతియగు యువతిని వర్ణింపవలసినచోఁ గవి దాని ప్రత్యంగ వర్ణనము సేసియే తీరవలయును. లోకములో నిది యనుభవముననే యున్నది, చూడుఁడు. మనమొక చక్కని యువతిని వర్ణించుచో సామాన్యముగాఁ జక్కనిచుక్క యనియో, బంగారుబొమ్మనియో, అప్సరస యనియో వర్ణించి పిమ్మట నామె మొగము, ముక్కు, కన్నులు, తలకట్టు మొదలగునవి యిట్లిట్లున్నవని ప్రత్యేకముగా

వర్ణింతుము. ఒక గాయకుని గానమును విని చాలా శ్రావ్యముగా నున్నదని మునుముందు శ్లాఘించి పిమ్మట నా యా రాగములు, ఆ యా వర్ణములు, ఆయా కృతులు—ఇట్లిట్లున్నవని ప్రత్యేకించి ప్రశంసింతుము. ఒక కవియొక్క కావ్యమును జదివి చాలా రసవత్తరముగా నున్నదని సాధారణముగాఁ గొండాడి పిమ్మట నా యా ఘట్టములు, రీతి, భావములును నిట్లిట్లున్నవని ప్రత్యేకించి ప్రశంసింతుము. ఇట్లు ప్రత్యేకాంగవర్ణన మెల్లెడల ననుభవసిద్ధమే. ప్రాచీన భారతీయ కవు లాదర్శప్రాయమగు సౌందర్యమును వర్ణింపఁబూని యేయే యవయవము లెట్లున్న సుందరతమములుగా నుండునో సూక్ష్మబుద్ధితో నూహించి యా యా యుపమాన వస్తువులను గల్పించిరి. వానిని సృష్టించిన వారి బుద్ధిసూక్ష్మతకు జోహారు లిడకతప్పదు. ఆ యుపమానములచేఁ గవి యా నాయికా లావణ్యమును మన కనులకు బ్రత్యక్షీకరించును. అంతేకాక యా యా యుపమానములచే (శరీరము దీఁగవలె నున్నది. మొ.) నా యా యువతులకుఁగల *రతిబంధార్హతలును స్ఫురించును. ఆంగ్లకవుల కిట్టి సూక్ష్మదృష్టి లేమిని వారి స్త్రీ వర్ణనములం దిట్టి సౌందర్యము గోచరింపదు. కావున సర్వాంగ సౌందర్యము పాఠకులకు గోచరింపఁ జేయవలెనన్నచోఁ బ్రత్యేకాంగ వర్ణనము జేయవలసినదే. కుచ, ఊర్వాది వర్ణనము వలన వారినిఁ గొంచెపఱచుట గాదు. లావణ్య సమగ్రతాప్రదర్శనమే. కుచోరువుల వర్ణింపకుండుట లోపమే. చిత్రకారుఁడు స్త్రీ చిత్రమును జిత్రించినపుడు స్తనములను జిత్రింప మానునా ? చిత్రకారిణియైనను మానునా ? "కుచాభావః కురంగాక్ష్యాః కావ్యాభావో విపశ్చితః" (పండితునకుఁ గవితాశక్తి లేకుండుట స్త్రీకిఁ గుచములు లేకుండుట

*నేఁటి కాలమున సర్కసులలో లతాంగులగు యువతులు మొగ్గలు మొదలగు వానిని వేయుచు శరీరమెన్నో విధములఁద్రిప్పుచుందురు. అట్టి లతాంగులే బంధములకుఁ దగినవారు.

వంటిది) అని కలదు. కానఁ గుచాభావము గొఱఁతయే. ఇప్పుడు అజంతా, ఎల్లోరా చిత్రములందలి స్త్రీలను బత్రికలలోఁ బ్రకటించు చున్నారు. అందు వర్తులములై దబ్బపండ్లవలె వారి స్తనములెంతో హృద్యముగాఁ గనఁబడుచున్నవి. వానినిఁ దొలగించిన నెట్లుండునో యూహింపుఁడు. కావున స్త్రీ వర్ణనమునఁ గుచోరువులఁ బరిత్యజించుటవలన సౌందర్య పూర్తికాఁజాలదు.

నఖశిఖాంత వర్ణనములనుబట్టి ప్రబంధనాయకులందఱును నొకే విధముగా నుండిరని మరొకనింద గలదు. ప్రత్యక్షముగా మనము చూచిన యొక వస్తువునుగూర్చి సూటిగాఁ బరులకుఁ జెప్పవలసినచో మాటలు సమర్థములు గావు. మాటలచే నా వస్తువును బ్రత్యక్షమొనర్చలేము. అది భాషకుఁగల లోపమే. అట్టియెడ దానినిగుఱించి లెస్సగా నుపమానములలోఁ జెప్పినచోఁ గొంతవఱకైనను దానిపోలిక తెలియగలదు. శాకుంతలమున శకుంతలను గూర్చి విదూషకునితోఁ దెలుపుచున్న దుష్యంతుఁ డెట్లు మాటలలోఁ జెప్పలేక యలజడి పడినాఁడో చూడుఁడు.

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేన మనసా విధినా కృతా ను ?
స్త్రీ రత్నసృష్టి రపరా ప్రతిభాతి సా మే
ధాతు ర్విభుత్వ మనుచింత్య వపుశ్చ తస్యాః.
విదూ-యద్యేవం ప్రత్యాదేశ ఇదానీం రూపవతీనాం."

ఇట్లు వర్ణించియు శకుంతలను విదూషకునికిఁ బ్రత్యక్షీకరింపఁ జాలఁడయ్యె. కావుననే మాటలచే నా సుందరినిఁ బ్రత్యక్షము సేయలేము. కావుననే ప్రత్యేకాంగ వర్ణనము చేయవలసి వచ్చినది. మరియుఁ బ్రత్యేకాంగ వర్ణనమును వదలి ప్రతి కవియు మొత్తముగాఁ జక్కని చుక్కనియో, బంగారు బొమ్మనియో వర్ణించినను బ్రబంధ నాయికలందఱును నొకేవిధముగా నుండరోటు! ఒక నాయికనుండి

మరొక నాయికను సౌందర్య వర్ణనమునుబట్టి వేఱుపఱపలేము. వారి వేషభాషలను వర్ణించి, వారి గుణశీలములను వర్ణించియు భేదమును జూపవచ్చును. ఎట్లన శాకుంతలమునఁ బ్రియంవదా-అనసూయలు సమాన సౌందర్యము గలవారే. (అహో సమవయో రూప రమణీయం భవతీనాం సౌహార్దం) కానీ ప్రియంవద హాస్యచతుర. అనసూయ వినీత. ఇట్టి భేదముచే వేర్పఱచి చూపవచ్చును.

"స్త్రీని భోగ్యవస్తువుగాఁ బురుషుఁడు చేసికొనుచున్నాఁడు" అనుచున్నారుగదా! ప్రకృతిచే స్త్రీ పురుషునికి* భోగ్యవస్తువే కాదన్నమాత్రమునఁ దప్పునా ? ఆమె ప్రకృతి యిది.

భోజనం ద్విగుణం స్త్రీణాం బుద్ధిః కృత్యే చతుర్గుణా
నిశ్చయః షడ్గుణః పుంభ్యః కామశ్చాష్టగుణః స్మృతః.

లోకములోఁ గొన్నియెడల (individual cases) దీనికి సమన్వయము కుదురకున్నను సర్వసామాన్యమగు (general) స్వభావ

---

*ఇట్టి యెడల వావిడిచి వచ్చివచ్చిగానే చెప్పవలయును. వైద్యకళాశాలలో నధ్యాపకుఁడు సిగ్గునువిడిచి యున్నదున్నట్లుగానే శాస్త్రీయములగు స్త్రీ పురుషాంగ రహస్యములను గూర్చి విద్యార్థినీ విద్యార్థులకు బోధించును గదా ! శాస్త్రీయ విషయములను బోధింపవలసి వచ్చినచో గ్రామ్యభాష నుపయోగించుట దోషముగాదు. శృంగార నైషధమున నశ్వమేధ క్రతుతంత్రమును గూర్చి కవియన్నమాట.

సు. యజమాన ప్రమదా వికస్వర భగన్యస్తాశ్వ దీర్ఘస్మర
ధ్వజ దండంబగు నశ్వమేధ మఖతంత్రంబుం బరీక్షించి య
క్కుజనుం డొత్తిలి నవ్వె..............................

మరియు లోకమున "వాఁడు దానిని......నాఁడు; అది వానిచేత......కొన్నది." అని వచ్చి గ్రామ్యభాషా వ్యవహారము గలదు. దీనినిఁ బట్టి స్త్రీయే కదా ! భోగ్యము. మరియుఁ గనుఁడు.

*"Man is the active agent and woman the receptacle. Their actions are therefore different and naturally their feelings are different. The man considers it his role to apply himself to the woman, for experiencing his pleasure and the woman thinks it her role to be applied to for experiencing her pleasure."

Kamasutra—Page 53.

మిదియే. "కామశ్చాష్టగుణఃస్మృతః" అను వచనమునుబట్టి స్త్రీ తన కామ సంతృప్తికై పురుషునికి భోగ్యమగుచున్నది. ఇందులకై యీమె పురుషునిఁ దన విలాసములచే నాకర్షించుచున్నది. దీని కవ ష్టంభముగా

"ఘృతకుంభసమా నారీ। తప్తాంగారసమః పుమాన్"

అని కలదుగదా! ఇంతేకాదు. స్త్రీకిఁ బురుషునికన్న సంభోగానందముగూడ నధికమే. కనుఁడు:

క. సురతంబునఁ గడునెక్కుడు
పురుషుల కంటెను సుఖంబు పొలఁతులకు; సురే
శ్వర ! యట్లగుటను నాకీ।
వెరవున రమియించి నిలువ వేడుక యయ్యెన్.

ఆంధ్రమహాభారతము- ఆనుశాసనికపర్వము - 27 పుట
భంగాస్వనచరిత్రము.

ఉ. చేతనమౌటయే యరిఁది ; చేతనమైన మనుష్యజన్మ మ
త్యాతత పుణ్యలభ్య ; మటులైనను స్త్రీజననం బలభ్య ; మా
జాతికిఁ గామము■ సురత సౌఖ్యము హెచ్చది ; పోవఁజూచినన్
ఘాతక ; మాత్మహత్యకు సమంబగు పాతక మొక్కఁడున్నదే ?

(అహల్యా సంక్రందనము)

మరియు

గీ. అదిమిపట్టినఁ గరులైనఁ జదియునట్టి
కడిఁది బలులగు మగలొత్తి కౌఁగిలింపఁ
గుసుమకోమలులగు సతుల్ కొనరుచునికిఁ
గనియు నెఱుఁగవె విపరీత కామశక్తి.

(కుమారసంభవము, చతుర్థాశ్వాసము, 79 వ పద్యము.)

ఈ కామాధిక్య సురత సౌఖ్యాధిక్య కారణములను బట్టియే తరుణి పురుషునికి భోగ్యమై యానందించుచున్నది.

మరియుఁ బురుషుని కన్న స్త్రీకిఁ బై వానితోపాటు సంతాన కాంక్షయు నధికతరము. దానిచే నామె భోగ్యమే యగుచున్నది. పురుషుఁడు కామాతురుఁడై యొకప్పుడు స్ఖలనము నొందుచున్నాడు. దానిచేఁ దాత్కాలికముగా వాని కామ మడఁగుచున్నది. అట్లు కామాతురురాలగు యువతికి స్ఖలనము గలుగదు పురుషసంపర్కము చేతను గళాస్థాన స్పర్శల చేతను గామోపశాంతి గలుగును. అప్పుడు యువతి భోగ్యమైయై కామోపశాంతినిఁ బొందుచున్నది. మరియుఁ గామాధిక్య కారణము చేతనే స్త్రీ యుపరతి కుపక్రమించును.

మన కావ్యములం దన్నింటను రతి, ఉపరతి, పునారతులు వర్ణింపఁబడియున్నవి. ప్రథమమునఁ బురుషకృతమగు రతి. పిదప స్త్రీకృతమగు నుపరతి లేక పురుషాయితము. మరలఁ బురుషకృత పునారతి. అప్పటి కిరువురికిని సంపూర్ణానందము గలుగును. విజయ విలాసము నందలి "మూఁడు వలపుల్ వలచెఁ ఫణిరాజ కన్యకన్" అన్న వాక్యము దీనినే బోధించుచున్నది. ఒకప్పుడు స్త్రీ పురుషుల కిరువురికిని సమకాలముననే స్ఖలనము గలిగి పునారతి గలుగదు.

మరియు స్త్రీ పురుషులలోఁ బురుషుఁడు పెద్ద; స్త్రీ చిన్నది గదా! ఏల యీ భేదము గల్పింపఁబడియుండును? తన కన్నఁ జిన్న యగు పురుషుని వలన స్త్రీకిఁ గామాధిక్య కారణమును బట్టి తగిన సంభోగానందము గలుగదని మన పూర్వులు తాదృశ భేదమును బాటించిరి.

సాంఖ్యమతసిద్ధాంతమున స్థాణురూపుఁడగు పురుషునిఁ(జీవుని) గాంచిన ప్రకృతికిఁ (సత్త్వ, రజ, స్తమోగుణముల సామ్యావస్థ.) జలనము గలిగి యిది పురుషుని నభిసరించుచున్నది. దాన సృష్టిగలుగుచున్నది. ఈ సిద్ధాంతమే లోకము నందలి స్త్రీ పురుషులలోఁ గాన వచ్చుచున్నది. మనుచరిత్రమున స్థాణుసదృశుఁడగు ప్రవరుని దర్శనము వలన వరూధినికిఁ జలనము గలిగి వాని త్రోవ కడ్డముపోయినదిగదా!

మరియు సాహిత్య దర్పణమున "ఆదౌ వాచ్యః స్త్రియాః రాగః పుంసః పశ్చాత్తదింగితైః" అని కావ్యమార్గమున స్త్రీకిఁ బురుషునిపై ముందనురాగముగలిగినట్లును బిమ్మటనే పురుషునికి దాని చేష్టాములదర్శనము వలనఁ గలిగినట్లును వర్ణింపవలయునని చెప్పినాఁడు. అనఁగా లోకమున నున్నదానినే యీతఁడు నిరూపించినాఁడు

మరియును బురుషుని యొద్ద కన్న స్త్రీ యొద్దనే భోగ్య సామగ్రి యధికము. చక్కని కేశపాశము; దొండపండు వంటి వాతెఱ, దబ్బపండ్ల వంటి గుబ్బలు; అరఁటికంబముల వంటి తొడలు; చక్రముల వంటి నితంబములు; ఇవన్నియుఁ బురుషుని నాకర్షించు సాధనములు. పలువిధములగు భూషణములు, చీరలు, స్త్రీలకు వలెఁ బురుషులకు లేవు. ఈ కాలమునఁ బాశ్చాత్య దేశములందు స్త్రీ సౌందర్యాభివర్ధకములగు నానావస్తువు లుత్పన్నములగుచున్నవి. (face powders; cents; lipsticks మొ.) మోజులు (fashions) దినదినము క్రొత్తవి బయలువెడలుచున్నవి. ఇవ్వన్నియు నేల? స్త్రీ వాని నుపయోగించుకొని తన ప్రియుని నాకర్షించి వానికిఁ దాను భోగ్యమై కామాధిక్యమును దీర్చుకొనఁగోరుచున్నది.

సంభోగసమయమున యువతిని లెస్సగాఁ గరగించుటకై పురుషుఁడు స్తనమర్దన చుంబనాధరాస్వాదాదులను జేయుచుఁ గళలంటుచున్నాఁడు. తన ప్రియునిచే నామె కావలెనని యివన్నియు గోరి చేయించుకొనును. ఏలన స్తనమర్దనాదుల వలనఁగానీ స్త్రీ

'Woman's feminine instinct is to make her man run after her. She will put on all her finery, have her hair specially shampood and waved, powder her nose, pluck her eye-brows, roufe her cheeks, lip-stick her lips and show lot of legs—why? in order to attract her man."

Mysteries of Sex—Page 22.

*"Ordinarily, when a woman is not stimulated, the entrance of the male organ to the vaginal cannal is not easy and smooth as the exterior lips of soft tissues surrounding it are dry, rather crinkled and vaginal opening is smaller than Man's distended organ. Zachhia

కరుగదు. కరుగనిచో ...... చెమ్మగిల్లదు. చెమ్మగిల్లినఁగాని విస్తరిల్లదు. విస్తరిల్లినఁగాని పురుషుని ...... సులభముగాఁ ప్రవేశింపదు. అప్పుడుగాని స్త్రీకి సంభోగానందము గలుగదు. పురుషునికిఁ దేజఃస్ఖలనసమయముననే యానందము గలుగును. కాని స్త్రీ లెస్సగాఁ గరగినపుడు పురుషుని......తన......ఁ బ్రవేశించినది మొదలు తేజఃస్ఖలనముదాఁకఁ దరతమభావముతో నానందము గలుగును. (సాతత్యా ద్యువతి రారంభాత్ప్రభృతి భావ (తృప్తి) మధిగచ్ఛతి; పురుషః పునరంతఏవ.) (వాత్స్యాయన కామసూత్రము 2-1-37). కావుననే సురతమునఁ బురుషునికన్న యువతికే సుఖమధికమని చెప్పఁబడినది. స్తనమర్దనాదులవలనఁ బురుషునికన్న స్త్రీకే సుఖమధికము. దానివలననే మోహోద్రేకము కలుగును. కావుననే యీమె కోరియుఁ బురుషునిచే వానినిఁ జేయించుకొనును.

స్త్రీకి మోహోద్రేకము గలుగనిచో నానందము గలుగదు. పురుషుఁడును నానందింపఁజాలఁడు. స్త్రీ స్తనమర్దనాదుల వలననే మిక్కిలి మోహమును బొందును. కావుననే యువతి కోరి చేయించు

points out in his great medico-legal treatise that "the husband must be attentive to the signs of sexual desire in his wife". "Women" he says when sexual desire arises within them, are accustomed to ask their husbands questions on matters of love; they flatter and caress hem. They allow some part of their body to be un-covered as if by accident; their breasts appear to swell and nipples erect; they show un-usual alacrity, they blush, their eyes are bright and experience un-usual ardous, they stammer, talk besides the mark, and scarcely mis-tresses of themselves. When woman is tumesent and is profoundly stirred and stimulated by court-ship the local parts become hot and swell, are flushed by the internal blood supply are to some extent turgical like those of the man, while secreation of the mucus copiously bathes all parts of the Vulva around the entrance to the Vagina; the walls of the cannal readily stretch to receive and fit the enlarged organ of the man."

The Mysteries of Sex—Page 63.

కొనును. ఒక్కొక్కత కాముకి స్తనమర్దనాదులు లేకయు మోహోద్రిక్తురాలై పురుషుని బలాత్కరించును. వరూధిని ప్రవరుని నట్లే చేసినదిగదా !

స్త్రీ పురుషునిచే స్తనమర్దనాదులు చేయించుకొన్నట్లు పురుషుఁడు స్త్రీచే నేమియుఁ జేయించుకొనఁడు. వానికి స్తనములు, కళాస్థానములును లేవుగదా ! కావున స్త్రీ స్వసుఖార్థము పురుషునికి భోగ్యమగుచున్నది.

మరియు "నిసర్గశాలీనాః స్త్రియః" అనికదా ! స్త్రీ స్వభావముచేఁ బురుషునిఁ జూచిన సిగ్గిల్లును. అది ప్రకృతిలోనే యున్నది. ఇదియే పురుషునికన్న స్త్రీ తక్కువ యనియు నాతనికి భోగ్యమనియు విశదముచేయుచున్నది.

పైనుదాహృతములగు కారణములనుబట్టి స్త్రీ భోగ్యమే. నేఁటికాలమున నున్నన్ని స్త్రీ సమస్యలు పూర్వకాలమున లేవు. సభారంగప్రవేశములులేవు. రాజకీయరంగ ప్రవేశములు లేవు. ఉద్యోగ వాంఛలేదు. వీని కవసరముగూడా లేకుండెను. కావున గృహిణులు వాసకసజ్జికలై తమ పతులకై యెదురుచూచెడివారు. గృహకార్య నిర్వహణము, భర్తతో సుఖించుట యను నీరెండే గృహిణి కానాఁడు విహితకృత్యములు.

> "ప్రజనార్థం స్త్రియస్సృష్టా స్సంతానార్థం చ మానవాః
> తస్మాత్సాధారణోధర్మః శ్రుతౌ పత్న్యా సహోదితః."

స్త్రీలు గర్భధారణార్థము లేక ప్రసవార్థము పురుషులు సంతానోత్పాదనార్థమును సృజింపఁబడిరి— అని యభియుక్తి.

నేఁటికాలమునమాత్ర మెంతనుంది యువతులు పురుషులతో పాటు సాంఘిక రాజకీయాది కార్యములందుఁ బాలుగొనుచున్నారు? విద్యావతులగు స్త్రీ లుద్యోగములు నిర్వహించుచు వివాహమాడి యా యుద్యోగమును వదలుకొనుచున్నారు. ఏలన స్త్రీలకుఁ బురుషుల

కార్యములు సరిపడవు. నవయౌవనమున నున్నవా రుద్యోగ మభి
షింపరు. విద్యావతులలో నుద్యోగ మభిలషించువారు దక్కువ.
సంసారసౌఖ్య మనుభవించువారే యెక్కువ. కావున స్త్రీ విద్యా
వంతురాలయినను, నుద్యోగము నిర్వహించుచున్నను దాంపత్య
సుఖాభిలాషిణియగుచో భోగ్యగాక తప్పదు.

ఈవిధము మనదేశమందే కాదు. పాశ్చాత్య దేశములందుఁ
గూడా విద్యావతులలో 100 కి 5 మంది మాత్రమే యుద్యోగములు
నిర్వహించుచున్నారు. ఆ దేశీయులును స్త్రీలను *భోగ్యములుగానే
తలంతురు.

కాఁబట్టి స్త్రీ యెల్లదేశములందును, నెల్లకాలములందును
భోగ్యమే. ఒక్కొక్కచోఁ బ్రపంచమున స్త్రీత్వాంశముగల పురుషు
లుందురు. పురుషత్వాంశముగల స్త్రీలును నుందురు. అట్టి స్త్రీలు

* స్త్రీ యెక్కడ చూచినా ఒకలాగే ఉంది. గ్రీకు రాజ్యంలో పిల్లల్ని కనడానికే స్త్రీ వుందని నమ్మకం. ప్లేటోలాంటి విశాలహృదయం గలవాడు గూడా అందమైన స్త్రీల నందరినీ ఓ చోటపెట్టి రాజులను మాత్రం వాళ్లతో కాపురం చేయమన్నాడు. 19, 20 శతాబ్దాల్లో జర్మనీదేశంలో స్త్రీని గురించి 3 'k' లు చెప్పేవారట. 'కిర్కీ కుచే, కుండూ'అని. అంటే చర్చికి పోవటానికి, వంటపని చేయటానికి, పిల్లల్ని కని పెంచ డానికి అని అర్థం.

చూ. 17-5-50 నాటి ఆంధ్రవారపత్రిక.

మరియు నీ క్రింది దానినిఁ జిత్తగింపుఁడు.

## 'వారి తీరు వేరు'

వాటికన్‌సిటీ, ఏప్రిల్ 28

పనిపాటులలో స్త్రీ పురుషులకు సమహోదా, సమగౌరవం అవసరమేనని అయితే జీవితరంగంలో స్త్రీల తీరు వేరని పోప్‌జాన్ అన్నారు.

సహజసిద్ధంగా స్త్రీనిర్వర్తించవలసిన ధర్మం వేరు. ఆమె జీవిత పరమార్థం మాతృత్వమే. స్త్రీ జనసహజమైన స్వభావానికి అనుగుణమై స్త్రీత్వానికి విపర్యాసం కలిగించే పనులేవీ వారిచేత చేయించరాదు. ప్రేమానురాగాలు తొణికిసలాడేటటు వంటి పనులే వారికి తగినవి. అని పోప్ ప్రపంచ కాథలిక్ యువతీ మండలి మహా సభలో అన్నారు. 110 దేశాల ప్రతినిధులు ఈ మహాసభలో పాల్గొన్నారు.

25-4-60 ఆంధ్రపత్రిక

మాత్రమే యుద్యోగములు నిర్వహింప నుత్సాహపడుదురు. పురుషుల తోడ దాము సమానలమని భావింతురు. కానీ వారైనను భోగ్యలు గాకపోరు.

ఒక యౌచిత్య విషయము: ఆంగ్లమున 'breasts, paps, thighs' పదములను గావ్యములందుఁ బ్రయోగించిరి. సంస్కృత కావ్యములందు స్తన, కుచ, ఊరు, జఘన, నితంబాది పదములను బ్రయోగించిరి. వానికిఁ దగినవిధమున నాంధ్రభాషలో వ్యవహారస్థ ములగు చన్నులు, చండ్లు, చళ్ళు, తొడలు, మొల మొదలగు పద ములనే యుపయోగింపవలెను. అవి యుచితములే కాక సముచిత ములును నగును. ఆయా యర్థములను బోధించు నాంగ్ల సంస్కృత పదములన్నియు నిత్యవ్యవహారస్థములే. కావున నిత్యవ్యవహారస్థము లగు చండ్లు, చళ్ళు పదము లశ్లీలములుగావు. భగినీ, శివలింగ-పుంలింగ, స్త్రీలింగాది పదములు లోకస్వీకృతము లయినట్లే యివియును గావలయును. సంస్కృతాలంకారికులెవ్వరును కుచ, ఊర్వాది పద ములను, దద్వర్ణనములును నసభ్యములని తెలుపలేదు. సంభోగ వర్ణనమును నిషేధింపలేదు. భగ, యోన్యాది పదములే వ్రీడాకరములు గాన నసభ్యములు. తద్వర్ణనములును నసభ్యములే (పూర్వోదా హృతములగు యోని, యోనికేశాదివర్ణనములు). మరియు దృశ్య కావ్యములందు నిషిద్ధములయినవన్నియు శ్రవ్యకావ్యములలో నిషిద్ధ ములు గానక్కఱలేదు. చుంబన సంభోగాదులు నాటకములో నిషిద్ధ ములు. దృశ్యకావ్యమగు శాకుంతలమున శకుంతలను ముద్దాడఁ బోయిన దుష్యంతుని వారించిన కాళిదాసకవి శ్రవ్యకావ్యమగు కుమారసంభవమున సంభోగమును వర్ణించెను. కావునఁ గుచవర్ణనము, ఊరువర్ణనము, సంభోగ వర్ణనమును శ్రవ్యకావ్యమున నిషిద్ధములు గావు. మరియు చళ్ళు, చండ్లు పదములును 'భగయోన్యాది పదముల వలె' నశ్లీలములు గావు. ఆలంకారికులు కుమారసంభవమున జగత్పిత

రులగు పార్వతీ పరమేశ్వరుల సంభోగవర్ణనము స్వమాతా పితృ సంభోగ వర్ణనమువలె నత్యంత మనుచితమనిరి. అంతేకాని లౌకిక సంభోగవర్ణన మనుచితమని విమర్శింపలేరుసుఁడీ !

మరియుఁ బురుషుఁడు స్త్రీనిగురించి బహుధా శంకించుచున్నాఁడనియు, నేఁటి విద్యావతులు నేయు నింద యొకటి గలదు. వేదము నందలి యూర్వశీ పురూరవ స్సంవాదమున నూర్వశీవచనమును గనుఁడు.

"With woman there can be no lasting friendship
Hearts of Hyneas are the hearts of woman."
(Treatment of love in Sanskrit Literature)
"Fraility thy name is woman" (Hamlet.)

ఈ యభిప్రాయమే యీ క్రింది శ్లోకములఁ గాననగును.

"స్త్రీయ శ్చరిత్రం పురుషస్య భాగ్యం
దేవో న జానాతి కుతో మనుష్యః?"
"ఔదుంబరాణి పుష్పాణి శ్వేతః కాకశ్చ దృశ్యతే
మత్స్యపాదో జలే దృశ్యః నారీచిత్తం నదృశ్యతే"
(సుభాషితావళి)

పై వానినిఁ బట్టి చూడఁగాఁ గామాధిక్య కారణమునఁ జేసి స్త్రీ చరిత్రము శంకాస్పదమని సారాంశము. చూడుఁడు: కర్ణుని జననమును బరమ రహస్యముగా దాఁచిన కుంతీ చరిత్రమును. స్త్రీ తన గూఢ మోహమును లవలేశమును దన పతిప్రభృతులకుఁ దెలియనీయదు. రంకాడనేర్చినది బొంకాడనేర్వదా ? అనిలోకోక్తి. 'ఆడుది యబద్ధమాడినచో గోడపెట్టినట్లుండుననియు, మగవాఁ డబద్ధమాడినచోఁ దడిక కట్టినట్లుండుననియును లోకోక్తులు గలవు. "నిసర్గ నిపుణాః స్త్రియః" "స్త్రీణామశిక్షిత పటుత్వం" అనునవియు నీ యర్థమునే వ్యక్తపఱచును.

వైదిక కాలమున స్త్రీ స్వభావ మీ క్రింది విధమున వర్ణింపఁ బడినది :

"Different views seem to have been entertained with regards to the character of woman. While on one hand, her good qualities are mentioned and praised we have on the other hand vehiment invictives against her fickleness and her impurity— a note which characterizes so much of later religious and didactic literature. The general opinion appears to be entertained in the following words put into the mouth of Indra.

"Indra declared that the mind of a woman was un-governable and her temper fickle"

(Treatment of love in Sanskrit poetry—Page 5)

సంహితా కాలమున స్త్రీ స్వభావ మిట్లు వర్ణింపఁబడినది :

"But latter Samhitas go further. The Maitrayani Sambita (I, X; II, IV. 3.) describes woman as untruth and classifies her with dice and drink as the three chief evils. In Taittariya Samhita (VI, 5, 8, 2) a good woman is ranked even below a bad man, and Kathaka Samhita alludes sarcastically to her ability to obtain things from her husband by Cojolory at night"

(Treatment of love in Sanskrit literature)

పురాణకాలమున స్త్రీ స్వభావ మిట్లు వర్ణింపఁబడినది :

Yet, after all is said, it cannot be affirmed that in the epic age woman, if not in theory, at least in practice was recognised as the equal of man; and nothing is more significant of the practical character and prosaic morality by the epic age than its attitude towards love and marriage. What is principally idealised in the epics is Conjugal love but obligation of chastity was laid on the weeker sex, and practically no limits are set to the licence of the man. Although fidility to a single spouse was reviewed

with approval, Polygamy, and Cuncubinage unchecked and seemed to have brought no disgrace either to man or to the gods; for woman was reviewed, if not directly as a chattal, certainly as an* object for the use and enjoyment of man. The picture of the epic heaven with its epicureon and sensual gods and its glorified courtesans is truly indicative of the epic man's attitude towards love and regard for his woman."

(Treatment of love in Sanskrit poetry.)

కావ్య వాఙ్మయమున నీ క్రింది విధమున వర్ణింపఁబడినది.

"In these works, as well as in Sanskrit love poetry generally the woman is usally described to be fully ardent as the man; and an interesting result of the comparative freedom, which woman in general is enjoyed we find that women wooed men as aften as men wooed woman."

(Treatment of love in Sanskrit poetry.)

పైనున్న యుదాహరణములఁ బట్టి స్త్రీ పురుషు లెల్లరును బరస్పరమును నీతి నియమములులేక స్వేచ్ఛగాఁ బ్రేమించుకొనుచుండెడివా రనుకొనవలదు. మన సంఘమునఁ గొన్ని యుగముల క్రిందటనే వేశ్యాకులము, దాసీకులము లేర్పడినవి. వారికి వివాహములు లేవు. నృత్య గానములు, వ్యభిచారమును వారి జీవనోపాయములు. వారు దమ నానా కళలచే సంపన్నులగు పురుషులను రంజింపఁజేసి వారిని వశపఱచుకొని ధన మార్జించుచు సుఖించెడివారు. ఐశ్వర్యవంతులగు రాజులు, ధనికులు మొదలగువా రట్టివారిని నుంపుడుక త్తెలనుగా నుంచుకొనెడివారు. బహుభార్యత్వము గూడ నుండెడిది. కావున మన సంఘమున కులస్త్రీలు, అకులస్త్రీలు అను నిఱుఁదెఱఁగులవా రుండిరి. కులస్త్రీలు వివాహితలు; అకులస్త్రీ లుంపుడుక త్తెలు. మరియు వివా

* కామాధిక్య కారణముచే స్త్రీలు స్వపురుషావర్జనమునకుఁ బాటుపడుదురు. అట్టిచో వారిని భోగ్యవస్తువుగాఁ బురుషులు దలంచిరన్నచో దోసఁగు లేదు.

హితలగు యువతులెల్లరును సీతా సావిత్రులవలె నుండరుగదా ! ఎంత మంది బంగారక్కలను మనము చూచుటలేదు ? భర్తలతో సహగమన మాచరించు సాధ్వీలును, బండువంటి సంసారమును బాడుచేసి భర్త లను విడనాడియో, చంపియో విటకాండ్రను వెంటాడు తుంటరులును గూడా గలరు. భర్త వలనఁ దమకు సౌఖ్యము కొఱవడినపుడు భర్త్రృ గృహమున నుండియే కామాధిక్యముచే వ్యభిచరించు కులటలను మన మెందఱినో చూచుచున్నాము. ఇట్టి యెడలనే స్త్రీ పురుషులు స్వేచ్ఛగాఁ బ్రేమించుకొనువారు. కావుననే సంస్కృతమున భాణముల వంటి శృంగార గ్రంథములు బహుళముగా బయలుదేరినవి. స్వీయా నాయికలందుకన్నఁ బరకీయాసామాన్యానాయికలందే కళావిలాసము లధికములుగా గోచరించును గదా ! భాణములలోని వేశవాటము నందలి యువతులు సంసారమును వదలివచ్చినవారే ! వారి విటులు శ్రోత్రియ విటులే.

ఈ స్మరగీత తరగతి ముక్తక పద్యశతకములు భాణ గ్రంథముల తరగతివి. భాణ లక్షణ మిది :

భాణస్స్యా ద్ధూర్తచరితో నానాఽవస్థాంతరాత్మకః
ఏకోఽంక ఏవాత్ర *నిపుణః పండితో విటః*
రంగే ప్రకాశయే త్స్వేనానుభూత మితరేణ వా
*సంబోధనో క్తి ప్రత్యు క్తీ* కుర్యాదాకాశభాషితైః
*సూచయే ద్వీర శృంగారౌ శౌర్య సౌభాగ్య (శృంగార)
వర్ణనైః
తత్రేతి వృత్తముత్పాద్యం వృత్తిః ప్రాయేణ భారతీ
ముఖ నిర్వహణే సంధీ లాస్యాంగాని దశాఽపిచ.

(సాహిత్య దర్పణము)

---

*భావ ప్రకాశకారుఁడు కోహలుని యభిప్రాయానుసారముగా భాణము శృంగారైక రసాశ్రయమని (వీరరస ప్రసక్తిలేదు:) తెలిపెను. భోజుని యభిప్రాయము

ఇందలి విభిన్నాక్షరములుగల లక్షణపదము లన్నియును నీతర గతిగ్రంథమునకుఁ బట్టును. ఇఁక భాణము దృశ్యము. ఈ కావ్యము శ్రవ్యము. ఇదియే భేదము. కాన నీ జాతి గ్రంథములను శ్రవ్య భాణములని కానీ, పాఠ్యభాణములని కానీ పేర్కొనవచ్చును.

ఈ తరగతి గ్రంథములలో 'శాలివాహన గాథా సప్తశతి' మొట్టమొదటిది. ఇది ప్రాకృత కావ్యము. దీనినే శ్రీనాథుఁడు "నూనూఁగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతి నొడివితి" అని వచించెను. దీనిని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగా రనువదించిరి. దీని ననుసరించియే యమరుక కావ్యము వెలిసినది. ఇది "అమరుక కవేరేక శ్లోకః ప్రబంధ శతాయతే" అన్న కీర్తిని వహించినది.

గూడ నిదియే. మొదటిదగు 'చతుర్భాణి'లోని నాలుగు భాణములును గేవల శృంగారమయములే. తరువాత దశరూపక, సాహిత్య దర్పణకారాదులు వీరమును జేర్చిరి. ఆనాఁటికి భాణములలో వీరముగూడఁ బ్రవేశించియుండును. కర్పూరచరిత మను భాణమున శృంగార వీరములు రెండును గలవు. మరియు సంస్కృతమున భాణమేకనాయకము **(Monologue play)**. ఇది యితర రూపములకన్నఁ బ్రాచీనతరము, దీనినుండియే యితర రూపకములు క్రమక్రమముగా వర్ధిల్లి నాట్యాంగ సమృద్ధములై నాటక, ప్రకరణ రూపమునఁ దుదికిఁ బరిణమించినవి. ఈభాణము పృథగ్జన వినోదార్థమని హేమచంద్రుఁడు నుడివెను. ఇది శృంగారైకరసాశ్రయ మగుటచేతనే పృథగ్జన వినోదార్థమని కొందఱు దలంతురు. కానీ శిల్పదృష్టితోఁ జూచినచో నిది చాల స్తుత్యము. ఏలన నిది యేకనాయకము. ఒకే నాయకుఁడు రంగమునఁ బలుపురితో నితర శృంగారనాయికలగు పరకీయా సామాన్యా నాయికలతోఁ దాను సంభాషించుచు వారి ప్రత్యుత్తరములను దానే వారికంఠస్వరముతో ననుకరించుచు గొప్ప కౌశలమును బ్రదర్శించుచున్నాఁడు. ఈ కారణమును బట్టియు శృంగార రసాశ్రయమగుటం బట్టియు బృథగ్జన వినోదము గలుగును. నేఁటి కాలమునఁగూడా **Mono-actor** ప్రదర్శనమును జూచి పెక్కంద్రు సామాన్యులేకాదు; పెద్దలును మెచ్చుకొందురు గదా! అట్లే భాణముగూడా పృథగ్జనులకే కాక శిల్పమునుబట్టి విద్వజ్జనములకును వినోదము గలిగించును. అభినవగుప్తుని భాణశబ్ద నిర్వచనమున నీయర్థమే యిమిడియున్నది. "ఏకేన పాత్రేణ హారణీయః సామాజిక హృదయం ప్రాపయిత వ్యోర్థః యత్ర స భాణః." అనియు, "ఏకముఖేనైవ భాణ్యంతే ఉక్తిమంతః క్రియంతే అప్రవిష్టా అపి పాత్రవిశేషాః యత్రేతిభాణః అనియు నిర్వచనములు గలవు.

దీని పిమ్మట భర్తృహరి శృంగారశతకమును రచించెను. అదియుఁ జాల హృద్యమైనదే. దీని పిమ్మట గోవర్ధనాచార్యుని 'ఆర్యాసప్తశతి' పేర్కొనఁదగినది. ఇదియు నమరుకము వంటిదే. దాని నీగ్రంథకర్తయే యాంధ్రీకరించెను. ఇవిగాక సత-సఈ (హిందీ) చండీకుచపంచాశికా ప్రభృతి శృంగార గ్రంథము లీ జాతిలోనివి గొన్ని గలవు.

ఇట్టి ముక్తక గ్రంథములను వ్రాయుట సుకరమగుపనిగాదు. వీనిని గుఱించి 'డే' ఇట్లు వ్రాయుచున్నాఁడు:

"In this respect the Sataka or Centuries of Hala as well as that of Amaru, which we take up presently, occupy a unique position in Indian love poetry. They not only demonsrate for the first time that love can very well form the exclusive theme of poetry and hunderds of verses can be written on its manifold phases, but they also start the tradition of the love lyric in the stanza form in which the aim is to depict within the restricted scope of a solitary self-standing verse some definite phase of the emotion. Such meneature painting is a task of no small difficulty; for it involves a perfect expression of pregnant idea or an intense emotion within very restricted limits by just of a few precise and elegant touches of the brush."

(Treatment of love in Sanskrit poetry.)

ఇట్టి శ్రవ్య శృంగార కావ్యములను గొందఱు జితేంద్రియులవలె శుకమహర్షులవలె నసభ్యములని నిందింతురు. ఆంగ్ల శృంగార దృశ్యకావ్యములను వారి లాస్యములను జూచినపుడు సామాజికులకుఁ గలుగని జుగుప్స వీనివలనను గలుగదని నా యభిప్రాయము. మఱియు గొందఱు ప్రాచీన శృంగార కావ్యముల నాదరింతురు. నవ్యకావ్యముల నేవగింతురు. ప్రాచీనములందుకన్న నవ్యములందే యౌచిత్యముండును. కానివారికి విరుద్ధముగా గోచరించును.

బాలబాలికల కుద్దేశింపఁబడిన పాఠ్యగ్రంథములందును నెన్నో యసభ్యపదములను జూచుచున్నాము. గ్రంథనిర్ణాయకసభ్యు లట్టి

గ్రంథము తమదో తమవారిదో యగుచో నా దోషములను బహిరంగ పఱపక కప్పిపుచ్చి పాఠ్యముగా నిర్ణయింతురు. పరులదయినచో నావ గింజంత దోషమును గొండంతగాఁ జేసి బహిరంగపఱచి యల్లరి సేసి గ్రంథకర్తకుఁ దలవంపులగునట్లు తిరస్కరింతురు. పదెనిమిదేండ్లనాఁడు ప్రొఫెసరు ఖండవల్లి లక్ష్మీరంజనముగారు (ఉస్మానియా యూనివర్సిటీ) తమ వ్రాసిన 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము' అను గ్రంథమున రేతఃపాతము, స్తనశల్యపరీక్ష, మొదలగు నసభ్యపదములున్నను విషయశుద్ధి, వ్యాకరణశుద్ధి లేకున్నను దానిని విద్యార్థినీ విద్యార్థులకుఁ బాఠ్యముగాఁ బెక్కు పరీక్షలకు నిర్ణయించుకొన్నారు. ఇంకొకరి పుస్తకమున "కామోద్రేకము" అను పదము నాలుగైదు తూరులు ప్రయుక్తమై యున్నను నది నిర్ణయింపఁబడినది. వేరొకరి పుస్తకమున "కామోద్రేకము" అను పద మొక్కచోఁ బ్రయుక్తమై యుండఁగా దానిని వేనోళ్ళ నల్లరిపఱచి పరిహసించి మహాదోషముగా గణించి దానినిఁ దిరస్కరించిరి. ఈ ప్రొఫెసరుగారు వ్రాసిన 'ఆంధ్రసంస్కృతి' అను గ్రంథమును శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'హిందూ' పత్రికలోఁ బరామృశించి పీనిలో 16 మహాదోషము (Blunders) లున్నవని చూపిరి. శ్రీవారా గ్రథమును విశ్వవిద్యాలయ పరీక్షలకుఁ బెక్కింటికిఁ బాఠ్యముగా నిర్ణయించుకొనిరి. కీర్తిశేషులయిన సురవరము ప్రతాపరెడ్డిగారు వీరిని వీరి సోదరులను 'శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్' అని వీరు శ్రుతిస్వరూపు లని శ్లాఘించిరి. ఒకతూరి మరొక ప్రొఫెసరుగారు "శిశ్నోదర పరాయణుఁడు" అను పద్యము గల నిగమశర్మోపాఖ్యానమును బాలబాలికలకుఁ బాఠ్యముగా నిర్ణయించిరి. "మహతాం నాస్తి పాతకం"

దీనినిఁబట్టి గ్రంథ నిర్ణాయకసభ్యుల యసభ్యదోషనిర్ణయ మెంత నిష్పక్షపాతబుద్ధితోఁ జేయఁబడినదియు నవగతమగును. ఇట్టివారు

బాలబాలికల కుద్దిష్టముగాకున్నను నిట్టి గ్రంథములను దెగడుదురన్నచో గణింపఁ బనిలేదుగదా !

*ఇట్టి మధ్యమ శృంగారరస గ్రంథములు బాలబాలికల కుద్దిష్టములు గావు. ప్రౌఢ నాయికానాయకులకే యుద్దిష్టములు (భాషలోని ప్రతి పుస్తకమును నెల్లరికిని నుద్దేశింపఁబడియుండునా ?) వారే యధికారులు. హాస్యములు, వక్రోక్తులు, మొదలగునవి వారికేకదా ! యర్థమగును.

కావ్య ముపదేశాత్మకముగా నుండవలయునుగదా ! శుద్ధ శృంగారముగల కావ్యమువలె నిట్టి పరకీయా సామాన్యా శృంగార భూయిష్ఠమగు మధ్యమ శృంగారకావ్య ముపదేశాత్మకముగాదు; కావున నుపాదేయముగాదు అని కొందఱనవచ్చును.

ధర్మ శృంగార గ్రంథములనువలెనే యర్థ, కామ శృంగార గ్రంథములను గూడా ప్రౌఢ నాయికా నాయకులు చదివి ద్వివిధ

---

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "క్రీడాభిరామము" తొలిపలుకును గనుఁడు. "విషముష్టివిత్తులు, నాభి, నల్లమందు, ఉల్లిపాషాణము, ఎట్టి చెట్టవస్తువులో ఈ క్రీడాభిరామముగూడా నట్టి చెట్టపుస్తక మేయనఁ దగును. వస్తుపరిజ్ఞానము చాలనివారు, వాడవలసిన వరుస నెఱుఁగనివారు, దురుద్రేకములకు మురియువారు, ధర్మాభిరతిలేనివారు, బాలురు, పామరులు, ముగుదలు, నట్టి వస్తువులను ముట్టరాదు. ఇట్టి పుస్తకములను జేతఁబట్టరాదు. అట్టివారికివి యప్పైనేని ననర్థములుగలిగినను గలుగవచ్చును. ఇఁక నిట్టి చెట్టతనముగల వస్తువులను, బుస్తకములను జెత్తకుప్పలోఁ జేర్పక యంగళ్ళకుఁ దెచ్చుటేల? అచ్చొత్తించుటేల ? అని ఆక్షేపమేని యిదిగో సమాధానము.

అవియు నివియుఁ గొంత యపాయకరములే యయినను నెక్కువగా నారోగ్యవర్ధకములు, నానందదాయకములు నగుచున్నవి. నిరుద్ధోపయోగమున విషములే కానీ యర్హోపయోగమున నవి యమృతములు. పండితులా వస్తువులను, నీ పుస్తకములను శుద్ధిచేసి దోషములఁ దొలఁగించి విషవికారము తెసరేఁగకుండునట్లును నారోగ్యము నానందము నలవడునట్లును వాడుదురు ......... అశ్లే యనుపమాన కవితాహ్లాదమును గలిగించుచు, ననేక ప్రాచీనచరిత్ర విషయముల నెఱిఁగించుచు, నింక ననేకాపూర్వశబ్దార్థ రహస్యముల నిరూపించుచు సహృదయ హృదయాహ్లాదములైన యిట్టి చతురకృతులుగూడా పండితలోకమునకు బహూపకారకములుగా నున్నవి. వీనిని నాశపఱచుటకు సరసులగు విద్వాంసులును సమ్మతింపరు."

శృంగారములకునుగల భేదమును దెలిసికొని యేది యుపాదేయమో యేది కాదో గ్రహింపఁగలుగుదురు. అన్వయవ్యతిరేకములచేతఁగదా! తత్త్వము లెస్సగా నవగతమగును.

ఇంతేకాక యీ గ్రంథములు భాణజాతీయములని తెలిపితిని. భాణము శృంగారరసమునుబట్టియు శిల్పమునుబట్టియుఁ బామర పండిత జనాహ్లాదమగున ట్లిదియు శృంగార కవితాశిల్పములను బట్టి పామరపండిత జనాహ్లాదకమే యగును. భాణము పై కారణమును బట్టియే దశవిధరూపకములలో బరిగణింపఁబడినది. దానిని నింద్యకావ్యముగా నెవ్వరును బేర్కొనరైరి. దీనినిఁబట్టి మధ్యమ శృంగారాశ్రయములగు నిట్టి గ్రంథములు నింద్యములుగావు.

"ఆనంద నిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః
యోఽపీతిహాసాదివ దాహ సాధుః
తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ."

గ్రంథకర్త.

# స్మరగీత



క. తొలి గీతాశాస్త్రముఁ బొలి
కలనన్ హరి యర్జునునకుఁ గఱపెడు నదనన్
లలనారాజ్యంబున నొక
వెలంది స్మరగీతఁ గఱపెఁ బ్రియశిష్యలకున్. 1

క. అఱువది యేఁడులు దాఁటెను;
నరసె శిరసు; రొమ్ము బిగువణంగెఁ; జెరిగె మై
సిరి; వాడిన పువ్వయ్యెను;
జరతియ యది; కాని యఱదు స్మరవహ్ని యెదన్. 2

క. పులుసణఁగదు చింతెండినఁ;
దలంగినను రాజ్యలక్ష్మి తల్లక్షణముల్
తలఁగవు దొర; కా ముసలికి
విలాసములు దీసిపోవు వీసమును మెయిన్. 3

గీ. నేఁటి వన్నెలుఁ జిన్నెలు నాఁటిదైన
బోటి శృంగారసామగ్రిఁ జాటుచుండెఁ;
దీరములకోఁతగుఱుతులు పాఱఁజూడఁ
దీసిన ప్రవాహపుంబొంగు దెలియుఁ గాదె ? 4

క. తలదువ్వి ముడిచి పువ్వులు,
వలిపంబు ధరించి, కమ్మ వలపులు గ్రమ్మన్

నలుగడలఁ దమ్మ నమలుచుఁ
గొలువుండును శిష్యురాండ్రు గొలువఁగఁ దన్నున్

క. ఆల స్త్రీపుంసభిదల, స్మర
కళాగతుల, సురతకేళికారీతుల, బి
ట్టలరించుచుఁ గుతిరేఁపుచుఁ
జెలువ కళఁపుఁ గన్నియలకుఁ జిత్తరువులతోన్.

క. అపరక్తుల నదికించును
గృప; స్మరమంత్రోపదేశ మిడుఁ బడుచులకున్;
అపతులకుఁ గట్టుఁ బతులను;
నపారపుణ్యమిటు లాపె యార్జించుకొనెన్.

గీ. కామదేవోత్సవమునాఁడు గలికిపిండు
చని తదాశ్రమమునకు దర్శనమొనర్చి
వ్రాలి తత్పాదధూళినిఁ దాలిచి తల
నాశిషములంది భక్తిమై నడిగి రిట్లు.

క. "చదివితివి రతిరహస్యముఁ
జదివితి 'వాత్స్యాయనంబుఁ జదివితివిగదా!
మదనామ్నాయములెల్లం
దదీయసారంబు దేవి! తగుదువు కళపఁగా."

ఆ. యౌవనాగ్నిమధ్యయందు నిలంబడి
తపమొనర్చి మదనదైవతంబు
వరములొంది, పెద్ద వడసి దివ్యజ్ఞాన
దివ్యదృష్టి లొప్పితివి భగవతి!

క. మదనక్రతువులు చూచితి
పది; పదిచేయించి, చేసి, వాసిగనితి;
భ్యుదయార్థినులము; మాకుం
ద్వదనుభవ రహస్యములను బలుకుము జననీ!" 11

క. అని విన్నవింప వృద్ధాం
గన యనె వినయంబు గరుడుగట్టంగ "నెఱుం
గని దేమి గలదు దెలుపఁగ?
ననవిల్తుని భక్తురాండ్రు నాఁ దగు మీకున్. 12

ఆ. కనఁగ మిమ్ము నాకె కఱపఁజాలిన గ్రంథ
సాంగురాండ్రటంచు నాత్మఁదోఁచుఁ;
గరతలామలకముగా నుండియే యుండు
మదన తంత్రశాస్త్ర మర్మమెల్ల. 13

ఆ. అయినఁ బెద్దనేసి యడుగుచుంటిరిగానఁ
దెలిసినట్టిదానిఁ దెలియఁబఱతు;
సౌభగంబుఁ బెద్ద జాణతనంబును
గలుగు మిమ్ముఁ గాంచ నెలమి గలుగు. 14

క. చిననాఁడె కన్నుగీఁటుచు
ననుఁ జాటుకుఁబిలిచి చుంబనాలింగనముల్
పొనరించిరి బాలకు; లి
ట్లనంగదేవోత్సవాంకురార్పణ జరిగెన్. 15

ఆ. తలుపుసందునుండి తడకకంతలనుండి
కడచి యొండొరువులఁ గావరించి

పెనఁగు పడుచుజంటలను గాంచు చానాఁడు
ప్రాయమొంద వేడ్కపడితిఁ బెద్ద.

క. పదునాల్గేఁడులు దాఁటెను;
బదాఱువన్నెపసిఁడిబొమ్మ పగిది నయితి; నా
కొదువయును దీఱె; నిఁకఁ బె
ల్లిదముగ రాఁదొడఁగె మదనలేఖలుఁ గాన్కల్.

క. కనుగొంద్రు నన్ను నవ్వుచు;
వెనువెంటం దగులుకొంద్రు వీథిని యువకుల్;
పనివడి మాటాడించుచుఁ
గొనిపోదురు దారిమార్చి కుంజంబులకున్.

క. స్మరదేవు ప్రసాదముకై
విరిపొదరుల, నేటియొడ్ల, వెన్నెల బయలన్,
గిరితటముల జవ్వనమునఁ
జరించితిఁ దపంబుఁ బెక్కు సంవత్సరముల్.

క. నిలుచుండియుఁ, గూర్చుండియు
వెలికిలఁబడి, నేలవిడిచి, వెనుక కొరగియున్
ఎలమిని యువాధరామృత
ములె క్రోలుచుఁ గృచ్ఛ్రతపముఁ బొనరిచితిఁ జూఁడీ!

గీ. కామదేవుండు నాకు సాక్షాత్కరించి
నీ తపశ్చర్య కెలమిఁ జెందితిని బిడ్డ!
అడుగు వరమన "దేవ! ధన్యాఽస్మి! నాకు
దివ్యదృష్టిని దయఁ బ్రసాదింపు" మంటి.

క. "కొనుమా ! యిచ్చితి; దీనం
గనంగలవు సకలనాయికారతిగోష్ఠుల్
వినఁగలవు నర్మసంభా
షణంబు"లని వరమొసంగి స్మరుఁ డిట్లనియెన్. 22

ఆ. "కన్న దృశ్యములను, విన్న చాటూక్తుల
నేకరించి శిక్ష నేయు మింతి !
యువతితతికి శ్రేయమొదవు వారికి; ధన్యు
రాల వగుదు" వంచు నానతిచ్చె. 23

క. మరుఁ డిడిన దివ్యదృష్టిని
వరంబునను సకలకామివర్గముల రహ
శ్చరితంబులు నర్మోక్తులు
సరిగా సాక్షాత్కరించె క్షణకాలమునన్. 24

క. స్మరదేవుని దివ్యాజ్ఞను
శిరసావహియించి కూరిచితిఁ బంచశతిన్
స్మరగీతానామముతోఁ
బరాకులేకుండ వినుఁడు ! పడయుఁడు శుభముల్. 25

క. స్మరగీతా శాస్త్రంబును
దరుణీతరుణులు పఠింపఁ దారుణ్యము సు
స్థిరమయి నిల్చును; జదివిన
జరతియు నెమ్మేయి చిగిర్చి జవ్వనమొందున్. 26

క. నిరతంబుఁ జదువవలయును
స్మరగీతన్ జలకమాడి సాయాహ్నములన్

విరిదండలు, దువ్వలువలు
ధరించి పూసెజ్జలెక్కి తారుణ్యవతుల్ !

గీ. "కామిగాని మోక్షకామిగాఁ"డందురు
ప్రాజ్ఞకోటి; కానఁ బడుచువారు
చదువవలయు మొదట స్మరగీతఁ ముతకలై
చదువవచ్చు నుపనిషద్గణంబు.

ఆ. పలికి యిట్లు త్రిదశవరకామపత్నులు
కులముపెద్ద లచ్చరలకు మ్రొక్కి
సంస్మరించి తనదు శైశవయౌవన
విటుల మెయిచిగుర్ప వెలఁది పలికె.

ఈ స్మరగీతాశాస్త్రమునకుఁ బరకీయానాయిక ఋషి కందగీతాదికము ఛందస్సు. మన్మథుఁడు దేవత. "కం. పు షుని కన్నను బొలఁతికె! స్మరకేళిని సుఖముహెచ్చు"— అనున బీజము. "కొరడాతోవలె జడతో"— అనునది శక్తి. "ఏ రైక దొడుగుదు? నేచీరం గైసేతు?"— అనునది మంత్రము "మేఁకువలెన్ గ్రుచ్చుకొంటి మిక్కిలియు నెదన్"— అనున కీలకము. "తరుణి మొగంబునఁగల కస్తురినామము బొమలవింట దొడఁగిన శరమై"— అనునది యస్త్రము. "కలువల జూపుమన్న లలిఁగన్నులఁ జూపుదు"— అనునది నేత్రము "....క్రొంగ్రొత్తవి లలనామణదాల్చు రవికలం బ్రతిదినమున్" —అనునది కవచము. "దాని సౌభగము సూచుచుండఁ బగల

బండె"—అనునది యోని. "హృదయ చోరుండ వందితి....
బాది నను ఖైదుగావించెఁ బడుకటింట"—అనునది దిగ్బంధము.

మన్మథప్రసాదసిద్ధికై యీ స్మరగీతాపారాయణము చేయు
చున్నాను (అనవలెను).

## ధ్యానము

క. జరతినిఁ జేతువు తరుణిగఁ;
దరుణికిఁ బుంభావమిత్తు; తరుణీతతిచేఁ
బురుషుల తలఁ దన్నింతువు;
స్మరదేవా ! నీ కివే నమస్కారంబుల్. 30

క. హరికిం జక్రము, శూలము
హరునకు, వజ్రాయుధంబు హరిహయునకు, నీ
కరణము సుమంబు; వారికిఁ
దరంబు గానిదియు నీకుఁ దరము రతిపతీ ! 31

ఆ. నీదు గాలి పొఱి నిండుపతివ్రత
సంతసాని యగు నిజంబు; నాకు
నీ ప్రభావముననె నిత్యకల్యాణంబుఁ
బచ్చతోరణంబుఁ బంచబాణ ! 32

క. తరగని యౌవనసంపద
తరగని సౌందర్యరేఖ, తరగని మోహ
స్ఫురణము, తరగని భోగము
స్మరదేవా ! నా కొసంగుమా ! ప్రార్థింతున్. 33

క. దయచేయుము దుర్లభుఁ బ్రియు;
వియోగ తాపంబు సంభవింపనియ ట్లి
వ్వయ మానందము గలుగఁగ
జయవెట్టెద; వరము లిమ్మ ! స్వామీ ! నాకున్. 34

క. ముక్కోటి వేల్పు లున్నను
నొక్కరును వరప్రసాద మొనరింపఁగ లే
ర్రిక్కముగ నీవు దక్కం;
బెక్కేలా ? ముగ్గురమలు నినుఁ గొల్తు స్మరా ! 35

# స్మరగీత

చ. ముదివిధి సంచరించు విడెముꣳ వలెఁ
బుక్కిటఁబట్టి జవ్వనిꣳ;
ఎద నదికించె శ్రీహరి; మహేశుఁడు
మేనికి నంటఁగట్టెఁబో!
మదవతి చూపుతూపుల కమాంతము
సోలిరి సంయతేంద్రియుల్;
ఎదిరిచి కామునిꣳ నిలువ నెవ్వరు
సాలుదు రన్యమానవుల్? 1

క. *పురుషునికన్నను బొలఁతికె
స్మరకేళిని సుఖము హెచ్చు; మహి సుకృతమునన్

---

*మహాభారతమున అనుశాసనిక పర్వమున ౨౭ పుటలో భంగాస్వన చరిత్రము జూచునది.

క. సురతంబునఁ గడునెక్కుడు
పురుషుల కంటెను సుఖంబు పొలఁతులకు; సురే
శ్వర! యట్లగుటను నాకీ
వెరవున రమియించి నిలువ వేడుకయయ్యెన్.

ఉ. చేతనమౌటయే యరిఁది; చేతనమైన మనుష్య జన్మ మ
త్యాతత పుణ్యలభ్య; మటులైనను స్త్రీజననం బలభ్య; మా
జాతికిఁ గామమున్ సురతసౌఖ్యము హెచ్చది పోవఁ ద్రోచినన్
బాతక; మాత్మహత్యకు సమంబగు పాతకమొక్కటున్నదే?

—అహల్యాసంక్రందనము. తృతీయాశ్వాసము-౨౮

దరుణీనయి జనన మొందితి
విరించికిఁ గృతజ్ఞురాలఁ; వేవేల్ జోతల్.

క. "పదియాఱువన్నె పసిఁడియ
సుదతీ ! నీ యొడలు చాలసొంపు లొలుకుఁ జూ !
పొదుగంబడ రత్నం" బని
యదుకుకొనెను రసికరత్నమగు ప్రియుఁడు ప్రియన్.

క. చనుఁ దలవాఁకిటిదాఁకను;
వెనుకకు విచ్చేసి ముద్దుపెట్టుకొనును; బో
వును మరల; వచ్చి మోవినిఁ
గొను; నరుగును; దిరిగి ప్రియుఁడు గ్రుచ్చుకొనుఁ జెలిన్.

గీ. కలవు నాదగు హృదయరోగముఁ గుదుర్చు
మందుమాత్రలు పొరుగింటి సుందరికడ
నాకు నధరామృతానుపానంబుతోడ
నాల్గుపూటలు సేవింప నయమగు నది.

గీ. ఆ లలనగాత్ర మొక్క రత్నాలరాశి
యన్యులకు లోభనీయంబ యగును; గాని
దాని వెలగట్టఁగా లేఁడ నేను దక్క;
దానిఁగొన లేఁడ యన్యుండు నేను దక్క.

క. హరినీలము లలకలు; ప
ద్మరాగ మధరంబు; కనకధరములు కుచముల్
తరుణి ! నిను వేరు విలుతురె
పరికింపఁగ రసికచక్రవర్తులు దక్కన్ ?

క. పొలయలుకఁ గాంచు నాతోఁ
జెలువుఁడు పలుకక మదీయ చిత్రపటం బ
ర్మిలిఁగొని ముద్దాడుచు, రొ
మ్ముల కదుముచు నాకు నీసు, ముదమును గొలిపెన్. 8

క. చెలికాఁడు నాదు నును జె
క్కుల యద్దములందు దిద్దుకొన మోమును, నేఁ
జెలువుని కనుపాపలలోఁ
దిలకించుచుఁ దీర్చుకొందుఁ దిలకము నుదుటన్. 9

క. ననుఁ జూడనట్లు సూచును;
గనుగిలుపని యట్లు గిలుపుఁ; గలుపని యట్టుల్
సనసన్న గలుపుఁ బలు, కా
తని మొగమునఁ గొంటెతనము తాండవమాడున్. 10

గీ. తనదు శృంగారనదియందు మునుఁగులాడు
రసికబృందంబుఁ బట్టంగఁ గుసుమగాత్రి
విసరి స్వకటాక్షజాలంబు వేచినట్లు
దారులం జూచుచును నిల్చె ద్వారమందు. 11

ఆ. తీవఁబోఁడి ప్రాఁకి పూవుంబొదలపైకి
విరులఁ గోయుఁ గనుల విందుగాఁగఁ
జనులు పూవుగుత్తులును, గెంపుమోవియుఁ
జిగురు, బొమలు లతలుఁ దగవులాడ. 12

క. చేయని శృంగారంబును
మాయని మడఁతయుఁ గలిగి రమాదేవి యనన్

మాయింటికి నిందయి తగఁ
బ్రేయసి నిక్కముగ శ్రీహరిని నేఁ గానే ? 13

క. దినదిన మేకైకకళముగఁ
గొని షోడశకళల మాత్రఁ గుముదాప్తుఁడు పొ
ల్చును; నావగలాఁడనఁ దాఁ
గని త్రుటి కొకటిగ సహస్రకళల వెలుంగున్. 14

గీ. చేయుచుంటిని గుడి ప్రదక్షిణము; నడుమ
నప్రదక్షిణముగవచ్చి యాఁగి యెదుటఁ
గనులపండువొనర్చి నన్ గౌఁగిలించె
వేల్పు ప్రత్యక్షమైనట్లు ప్రియతముండు. 15

క. మదనానలతప్తంబగు
మదీయబాహుపుటమందు మగువా ! నిలుపం
గదె ! నీకాంచనగాత్రం
బది కడు వన్నెక్కి వెలుఁగు నతిరమ్యంబై. 16

క. వలయాకృతిఁ బఱచుచుఁ దనుఁ
జెలువుఁడు వెంటాడెనంచుఁ జెలువయుఁ; దన్నుం
జెలువయె వెనుకొనె ననుచుం
జెలువుఁడు వాదించుకొనిరి చెలువముకతనన్. 17

క. కరమూలంబులఁ, జెక్కుల,
నురోజముల, నాభిపైని, నురుజఘనమునన్,
గుఱువులఁ, జెలువునిచూపులు
గరముల గిలిగించినట్లు గడు నలరించెన్. 18

క. కనుచున్న నిన్నుఁ, గూర్చు
న్నను నీకౌఁగిటను, గొమ్మ ! నవనవకేళిం
బెనఁగుచునున్నఁదనియ ; ధా
త్రిని "శ్రేయసి కేన తృప్యతే ?" యంద్రుగదే ! 19

క. మొల నూలయి, పూమాలయి
గళమున, గాత్రమునఁ గనకకవచంబై నా
లలనామణి కూర్చుచు ని
చ్చలు నిలు వెలిగించు వేయిచంద్రుల పెట్టై. 20

ఆ. నీలరత్న మగును నెలఁతుక శ్యామాంగి ;
వలఁదరాలు ముద్దబంతి పూవు;
వడలినట్టి పండు వయసు వ్రాలినది; శ్రీ
యన్న నేకరమ్య యన్నమాట. 21

చ. రమణుని యర్ధదేహమునఁ గ్రాలు
భవానినిఁబోల వామ పా
ర్శ్వమునరి నిల్చి నా తనువు
వాని శరీరముఁ జొన్పఁ జేసియ
త్నముఁ దుది నస్మదూరులఁ బెనంచి
తదర్ధపు మేనిముందు గా
త్రము నిడితిం; బ్రియుం డొడిసెఁ
గ్రన్ననఁ జన్నులు; ముద్దులుం గొనెన్. 22

క. చెలి ! నన్నుఁ గాంచి నెమ్మొగ
మలంతి త్రిప్పితివి; చెక్కుటద్దముననను నా

చెలువు మును దిద్దుకొమ్మని
పలుకుదె ? రమణీయ ముగ్ధభావముతోడన్. 23

గీ. కన్ను గుట్టించు నీ వన్నెచిన్నెలు గని
మెఱుఁగుఁ దీవందు; రదిగావు మరులు దీఁగ;
వలరుఁబోఁడిరొ ! నినుఁ గళ్ళ కమృతబిందు
వందు; రదిగావు చొక్కు మం దగుదు వరయ. 24

క. మొదలనె బంగరుబొమ్మవు
మదనుండు మెఱుంగువెట్టె మఱియున్, మఱియున్;
సుదతీమణి ! పొలకుఁ బం
చదార జతపఱచినట్లు స్వాద్యవయి తహో ! 25

క. తిలకముఁ దాల్పక వచ్చెను
విలాసినీతిలక; మూని వివిధవిభూషా
వళి మాత్రంబును; నా ముఖ
తిలకం బంటించుకొన మదిం దలఁచె నొకో ! 26

క. పిఱుఁదుల సింహాసనమున,
స్ఫురన్ముఖద్యుతి వితానమునఁ జనుఁగవపై
విఱిసిన యిరుజడలు జా
మరములుగా రాణివోలె మగువ వెలుంగున్ 27

క. ననుఁగనుచుఁ గలికి నేఁగనఁ
దనదృష్టి మరల్చె; వివశతన్ నిగిడి, యెదు
ర్కొను నా చూడ్కిని నది మా
ర్కొని, పెనఁగొని, తుదికి గెలిచికొని వచ్చెపడెన్. 28

క. ఎగఁజూడ నొక్కయందము
దిగఁజూడఁగ నొక్క సొగసు, దిరుగఁగ నడ్డం
బుగ నొక్కచెలువ, మట్టులె
యగపడు నందాలరాణియనఁ జెలి నాకున్. 29

క. వనిత ప్రతికూలకార్యమె
పనివడి కావించు. బెఱఁగి పతి వచియించున్
"నను ముట్టకు; మో వీయకు;
చనులం గ్రుమ్మకుము; మే నొసంగకు" మనుచున్. 30

క. పలుకులు స్మరమంత్రంబులు
దళుకులు దంత్రములు; కనులు, స్తనములు యంత్రం
బులు; లాఁతులెంత ? శుకముని
చెలి వక్షఃపంజరంపుఁ జిలుకై చిక్కున్. 31

క. నను రాచుకొనుచుఁ బోవును;
జను మొనలను బొడుచు నిఱుకుసందునఁ; దన కొం
గునఁ గొట్టును; మా ప్రతివే
శిని యింటికి రాకఁబోకఁ జేసెడు నదనన్. 32

క. కుసుమాయుధ శాస్త్రంబున
నసమానప్రజ్ఞఁ గొన్న యతివను బెండ్లై
రసికాచార్యుఁడు వీఁడని
హసింప జను లతఁడు బ్రమసె నది బిరుదముగాన్. 33

గీ. పరిమళంబు సృజింపక స్వర్ణమునకుఁ
గొఱఁత నేసిన విధి దిద్దుకొనెను దప్పుఁ;

గలికి పదియాఱువన్నె బంగారుమేయికిఁ
గమ్మనెత్తావి నిడి సమగ్రతనుగూర్చి.

క. వెనుకలఁ బోదవగుజడ, రొ
మ్మున నేకావళియు వ్రేల బొమముడితో జ
వ్వని ననుఁగొట్టఁగఁ గట్టఁగఁ
గొని కొరడాఁ ద్రాడు వచ్చు కొమరున నుండెన్

చ. పొలఁతుక గూరుచుండి తనముంగిటఁ
గన్బొమ నొక్కఁడెత్తి చి
ప్పిలఁగ విలాస మోలిఁ బ్రతివేళ
గృహాంబునఁ జంద్రశాలపై
నిలిచిన నన్నుఁ గన్గొనియె
నిర్నిమిషంబుగ; డాయఁగా ననున్
నిలువున నింద్రనీలముల నిచ్చెన
వేయుచు నున్నదోయనన్.

క. కన నీదుమోముజాబి
ల్లిని నా నయనాబ్జములు చెలీ! కడు వికసి
ల్లు; "న భూతో న భవిష్యతి"
యనవచ్చు నమూదృశక్రియ ధరిత్రి పయిన్.

గీ. పడుకటింటను దొలినాఁడు పడి యెదుటను
మోము వ్రాలిచి నేలచూపులనె పఱచు
చింతితలబంతి నిలిచెఁ; జూడ్కొటులొ బెడిసి
బేడిసయుఁ బోలె మిట్టిమిటాడుచుండ

గీ. ౘ్రోల నిలిచినఁ గనుదు నీ ముద్దుమోము,
వెనుదిరుగఁ బిన్‌పిఱుందులు, విరులజడయు,
నడ్డముగ నిల్వఁ జెక్కిలి నతివ! యెట్టి
రూపమైనఁ జక్కెరబొమ్మ రుచ్యమె కద! 39

గీ. ఒంటిజడవేయు; విరియించి జంటజడలు
దాలుచు; సడల్చి సవరించుఁ గీలుగంటు
విప్పి చౌశ్లెంబుగాఁ జుట్టు నొప్పులాఁడి
తుదికి విరఁబోసికొనుఁ గురుల్ దువ్విదువ్వి. 40

క. ఒకనాఁడు తుమ్ముఁ దుమ్మ; మ
రొకనాఁ డను "రేఁపు నా వ్రతోద్యాపన" మిం
కొకనాఁడు పండుగను; నా
కొకనాఁడును సాఁగనీయ దువిద పయనమున్. 41

క. తలచుట్టుఁ బువ్వుదండను,
గళమునఁ బూమాలఁ, గేలుగవఁ బువుఁగడెముల్,
మొలఁ బూలనూలుఁ, దాల్పఁగఁ
జెలినిం 'బుష్పవతి' యని హసించిరి సకియల్. 42

ఆ. వ్రాయుచున్న నా కరంబును గదిలించు;
మూసివేయుఁ జదువు పుస్తకంబు;
నిదురమంపునెంద సుదతి నా యొళ్లాఁపు;
నెందుకనఁగ నవ్వు "మందు" కనుచు. 43

క. చనుచుంటిని భగవద్ద
ర్శనంబుకై గుడికి; గోపురముకడనె యెదు

ర్కొని కలికి బుజము రాయుచుఁ
జనె; యాత్రాఫలము గలిగె క్షణమున మాకున్.

క. అందఱితో నవ్వుదు వెపు;
డందఱిఁ గలిపికొని మాటలాడుదు వెవెవో!
అందఱినిం గ్రేగంటను
గందువు; నీ మర్మ మెఱుఁగఁగాదు తుటారీ!

ఆ. కట్టినట్టి చీరఁ గట్ట వేనాఁడును;
దొడిగినట్టి రయికఁ దొడుగఁ బోవు;
"సత్యభామ" వంచు సకులాడ "నా ప్రియుం
డగును గాదె? కృష్ణుఁ" డనె మిటారి.

క. యువతీమణి! "ఘృతకుంభం
బవు సతి; పురుషుండు మండుటగ్ని" యటంచుం
గవులంద్రు; గాని నీవే
యవు దగ్గివి; నేతిచెరవ నగుదును నేనే.

ఆ. ఎంత దొలనున్న నింతి మేల్బంతిరో!
తారవోలె రేలఁ దళతళమని
మెరయుచుందు; వెట్లు చరియింప నేర్చితి?
వారివీరి కంటఁబడఁగరాక.

క. విరిసెజ్జ నభిముఖంబుగఁ
బరుంటి మన్యోన్యపాణివల్లులు దిండ్లన్
విరచించి, మెలిచి మా యి
ర్వురి మేనులు, బిగిచి బాహువుల మా కౌనుల్.

గీ. అమృతపానంబు నిర్జరత్వము నొసంగు;
రమ్మ! యన్యోన్య మధరామృతమ్ముఁ గ్రోల;
నిర్జరత్వంబుచే నసందిగ్ధమబ్బుఁ
గొమ్మ! సశరీరమైన స్వర్గమ్మ మనకు. 50

ఆ. "అక్క మనదియైన యగునొకో! మనవాఁడు
బావ?" యంద్రు; కాని వాస్తవముగ
బావ నాకుఁ బరమబాంధవుండయ్యె; మా
యక్కయే పరాయిదయ్యె నకట! 51

క. కనుగీటఁగఁ గనుఁగీటితిఁ;
గొనపంటను మోవిగొఱుకఁ గొఱికికొనితి; నన్
గని ప్రియుఁడు నవ్వ నవ్వితి;
జనసమ్మర్దమున మగనిచాటునఁ జనుచున్. 52

క. అడవింగాచిన వెన్నెల
వడువున నీజవ్వనంబు వ్యర్థపఱతువే?
పడఁతీ! *యులూపి పార్థునిఁ
బడసిన కత సంస్మరించి వర్తిలుము తగన్. 53

గీ. కమ్మవిల్కాని జయలక్ష్మికరణిఁ దరుణి
చొక్కమందనఁ గరలతల్ చుట్టిమెడకు
మోవిపై మోవిఁజేరిచి ముద్దులీయ
ముఖ్యమగు పుణ్యకాల మాప్రొద్దు నాకు. 54

*ఉలూపీ-అర్జునుల వివాహము వితంతూద్వాహము.

ఆ. అరతి నుపవసించి తరుణిరో! రేయెల్ల
సలిపియుంటి నిష్ఠ జాగరణముఁ;
దావకాధరామృతముఁ గ్రోలినంగాని
పరిసమాప్తిగాదు పారణంబు.

క. ఎదురయ్యె నిఱుకుసందున
మదనసముఁడు నా మఱంది; మాటాడ కతం
డొదుగకయ వచ్చి నవ్వుచుఁ
దుది నా దువ్వలువఁ ద్రోచి దూఱెను గాళ్ళన్

క. అతివా! నీ రోమావళి
లత పూచిన పూలగుత్తుల యటంచుఁ గడుఁ
గుతికొని నాకను దేఁటులు
సతతంబును వ్రాలు నీదు చందోయిపయిన్

ఆ. తపము ముగిసి కన్నుదమ్ముల విప్పంగఁ
బువ్వుఁబోఁడి ప్రియునిముందు నిలిచి
"అయ్యె సుప్రసన్నురాలు నీ పరదేవి
వరము లడుగు", మనుచుఁ బలుకు నగుచు.

ఆ. మరువ మమ్మఁ దెచ్చి మా వీథి కొకకొమ్మ
వాగ్విశుద్ధి లేమి భంగిదప్పి
మాటిమాటి కఱచె "మర్మము మర్మ" మం
చడుగ "నెంత వెల?" యటంచు యువలు.

గీ. "కాను మేనత్తకూఁతురఁ; గాను నీకు
మేనమామకొమిరెఁ; గాను మేనగోడ;

లేటి సయ్యాట? లి"వ్వన బోటి నగుచు
"మనది *బాదరసంబంధ" మనెఁ బ్రియుండు. 60

గీ. కలికినవ్వుపువ్వు లొలికింప కోకొమ్మ!
కోరచూపుతోడ గ్రుత్తువేల?
కొమ్మవనఁగఁ బూలకొమ్మ వన్కొంటిని;
నెఱఁగ ముండ్లకొమ్మ వీ వటంచు. 61

గీ. కొట్టుదునె? తిట్టుదునె? నిన్నుఁ గోమలాంగి!
కూర్మిమైఁ జెక్కిలిని ముద్దుగొందుఁ గాని
కటికిరానేలఁ గూర్చుండు కందిపోవ
గాత్రలత; నాదు నంకభాగంబు లేదె? 62

క. తొలికూటమినాఁ డుదయము
చెలి పిగిలినజిలుఁగుఁరయికఁ; జిట్లిన గాజుల్,
పలిగిన మొలనూలజెలుఁ
గలుకులు వేలంబుఁబాడఁ గడిఁగిరి నగుచున్. 63

క. విలువలె వంగిన కనుబొ
మ్మలుఁ, గెంపులు గ్రక్కుమోవి, మదగజ కుంభం

*బాదరసంబంధము = బాదరాయణ సంబంధము. "యుష్మాకం బదరీచక్ర మస్మాకం బదరీ తరుః। బాదరాయణసంబంధా ద్యూయం యూయం వయం వయం" అని యొక యర్థము.

"బదరీఫలములంత స్తనములుగల వయస్సు నుండియుఁ గల సంబంధము" అని మరొక యర్థము.

"బదరీవృక్ష కుంజములోని సంబంధము" అని వేరొక యర్థము.

బులఁబోని గుబ్బచన్నులు,
వెలంది ! నీగాత్రలతకుఁ బెట్టని సొమ్ముల్.

క. తన ముంజేతులకవతో
ననుఁ జక్కఁగ నడ్డపాపనాఁ బ్రియుఁడెత్తున్;
దనియక మనమున ముద్దులు
గొను నా నెన్నుదురు దొట్టి కుఱువుల వఱకున్.

ఆ. కనులకలువరేకులును, ముక్కుసంపెంగ,
మోవిచిగురుఁ, జనుల పూవుగుత్తు,
లలరఁ గేలుదీవ లతివ పూమాలయై
ప్రియుని గళమునందు వ్రేలుచుండె.

క. ఒకరొకరిని లక్షింపక
మొకములు వంచుకొని నడచిపోవుచు నెదురై
యొకచోఁ దొడిఁబడు చొక ప్ర
క్కకె యడుగిడ డీకొనెను మొగంబులు కవకున్.

క. యజమానపత్ని తను బు
త్త్విజు లడుగఁగ మూఁగి విటుల వితమున, నగుచున్
నిజవిక్రమములు వినిచెను
యజనస్థలి వేళవాటియయ్యెం దుదికిన్.

క. వచ్చిన యపవాదెట్లో
వచ్చెను; రచ్చెక్కినాము బాలామణిరో !
విచ్చేయుము ! మా యింటికిఁ;
గ్రచ్చఱఁ జలియున్నె పూర్తిగా మునిఁగినచోన్ ?

ఆ. తరుణి నా *పతంగి దారంబుఁ బెనవేసి
తన పతంగి దారమునను నగుచుఁ
గోసివేసి పొగడుకొనుచుండె విటకాంద్ర
త్రాడుఁ ద్రెంచఁ దగ్గదాన ననియొ ? 70

క. కౌమరుంబ్రాయపుఁ గోమలి
కుమారసంభవముఁ గఱప గురువుం గోరెన్
సుముహూర్తంబున సురభిళ
సుమమధురఫలంబు లొసఁగి చూపుల నగుచున్. 71

క. ననుఁ దొంగితొంగి చూచుచు
ననఁబోఁడి తదీయగురుల నడుమ నిలిచియున్
గనువిందు సేసె నాకుల
పెనుజొంపమునందు వెలుఁగు విరిచందమునన్. 72

క. చెలినొసలిపైని మూఁగిన
యలకలు సంకెళ్ళొనర్చి యస్మద్వదనం
బులఁ జుంబనలాలసముల
వలరాజు బిగించి కట్టివైచును సతమున్. 73

ఆ. "బాలవయ్యుఁ జాల ప్రౌఢచందంబునఁ
గఱచితెట్టు లిట్టికళ ?" లటన్నఁ

*పతంగి = గాలిపటము. హైదరాబాదు దేశమున సంక్రాంతిపండుగకు ముందు కొన్నిదినముల నుండియు గాలిపటము లెగురవేయుదురు. వానినిఁ జిత్రవిచిత్ర రూపముల సృజింతురు. ఒకవిధమైన దారమును దయారుచేయుదురు. దానిని 'మాంజా' అందురు. అది చాలా గట్టిగానుండి దర్భ యీనెవలె వాఁడిగలిగి కోఁతఁ గోయును. గాలిపటమున కా దారమును గట్టి వదలి మరొకరి గాలిపటముయొక్క దారమును గోయుదురు. అప్పు డా పతంగి పడిపోవును.

జిలిపినవ్వు నగుచుఁ "జేఁపపిల్లకు నేర్ప
వలెనె యీఁత ?" యంచుఁ బలికెఁ గలికి. 74

క. తన చెక్కుటద్దములుఁ, జ
క్కని వాతెఱకెంపు, గాత్రకనకమ్మమ్మం
గనౌ క్రేతృతతికిఁ ? గూర్చుం
డెను బూవుంబోఁడి యంగడినిఁ గులుకు చిగో ! 75

క. అతికించెఁ దరుణి యురమును
బతియురమున లెస్సనాటి వాఁడిచనుమొనల్:
అతఁ డదికి జఘనముల నా
యతబాహాలతల నడుమ లంటంగట్టెన్. 76

క. ఒకపరి బావా ! యని, వే
రొకతూరి 'మఱంది !' యని మరొక్కతడవఁ గో
రికిమెయి 'మామా !' యని యిం
కొకతఱి 'నల్లుండ !' యని ప్రియుం బ్రియ పిలుచున్. 77

క. స్తనఫలవాయన మొసగెను
గొని మోహవ్రతముఁ గుసుమకోమలి గది, వ
చ్చిన ప్రియతమునికి, మహిత
ప్రణయాగమ మంత్రసూక్త పఠనపరునికిన్. 78

ఆ. తావకాధరము సుధానిధానంబౌట
నిండుజవ్వనమున నెగడె దెపుడు;
లాఁతి చెలుల మోవులను లేదొ ? యద్ది కా
కున్న నవుదు రేల యువజరతులు ? 79

చ. జడ సడలించి వైచికొను
జార్ముడి; దువ్వలువూడ్చి పా
వడయును బైఁటయుం దొడుగు;
వన్నె వహించిన చుక్కబొట్టు ది
ద్దెడుఁ దగ గీఱునామముగ;
దేహలతంగల స్వర్ణభూషలన్
విడిచి విరుల్ ధరించుఁ;
బ్రతివేశిని నన్గొనఁ గ్రీతదాసుగాన్ 80

క. మఱదిఁ గని నవోఢాపతి
"మఱతువె ? న"న్ననుచు వదినె మాటాడంగాఁ
చిఱునవ్వుతోఁ "గాను జుమీ
గురువిద్రోహం బొనర్చు క్రూరుఁడ" ననియెన్. 81

క. నెలయును వెన్నెలయునువలె,
నలరుందావియునుబోలె, నమృతము రుచియుం
బలె నవినా భావంబునఁ
జెలువా ! మన మంటుకొనియ జీవింత మిఁకన్. 82

ఆ. వన్నెకాఁడు దఱిసి నన్నుఁ "బరీక్షింతు
నీదు మైపసిండి నిమునమాఁగు"
మని స్వగాత్రనికషమునకు రాయఁ దొడంగె
మొగమునుండి పాదయుగము దాఁక. 83

క. తలవనితలంపుగా దే
వళమున నిలిచితిమి ప్రక్కప్రక్కల నొక కో

మఱియును నేనును; మా చెం
గులకున్ ముమ్మొఱ్ఱవై చెఁ గొంకెయొ ? వేల్పా ?

క. కనుఁగీటును; జనుబంతులఁ
గనంబఱచు; మోవిఁ గొఱుకుఁ; గౌఁగిలి సూపున్
ననఁబోఁడి మిన్న లాస్యా
భినయవ్యాజమున నాకుఁ బెద్దల యెదుటన్.

క. కొరడాతోవలె జడతో,
శరములతోవలెఁ గటాక్షజాలముతో, నన్
గుఱిసేసి గుండ్లతోవలె
సరోజముఖి రొమ్ములొడ్డి సాగె నెదుర్పన్.

*గీ. "మగువ పాపంబు సర్వంబు మగనిఁబొందు"
నని పురాణంబుఁ జదివినడ్డాలకించి
ధృతిని వహియించి యువతి యా దినమునుండి
యెమ్మెకాండ్రనుబట్టి పీడింపఁ దొడఁగె.

గీ. వెనుకకుం గ్రుచ్చి కేలుదీవియ లలంతి
వ్రాలి కూర్చున్న క్రాల్గంటి వలుఁదచనుల
గండముల రమ్యపత్త్రిభంగముల వ్రాయు
సరసుఁ డాసీనుఁడయి తదుత్సంగ మధ్య.

క. విరిసెజ్జపైనిఁ దమ కూ
ర్పరంబులం గ్రుచ్చి యెదురుపడి ప్రక్కఁ గరాం

*రాజా రాష్ట్రకృతం పాపం। రాజపాపం పురోహితః
భర్తా చ స్త్రీకృతం పాపం। శిష్యపాపం గురుర్వహేత్.

బురుహములనుంచి శిరసులఁ,
బరుండి రొండొరులఁ గేలువై చికొని ప్రియుల్. 89

క. చిమ్మఁడగ్రోవియనఁగ నా
కొమ్మయొడలు హొయలుఁజిమ్మఁ గోడెలపై మా
ర్గమ్మనఁ జనుచును; స్మితహసి
తమ్మను గందవొడిఁ జల్లుఁ దద్వదనములన్. 90

గీ. అభినయించుచుండ నాయాయిపదములఁ
గలికి యొకతె "నన్ను గాంచి నవ్వె!
నన్నుఁ బిలిచెఁ; జేసె సన్న నా"కని యువల్
చంక లెగురవేయసాఁగి రచట. 91

క. అహరహమును నే నీదు వి
రహతీర్థమునందుఁ గ్రుంకి రహి రాత్రిఁ జతుః
ప్రహరములు నిలిపి నిను మది,
సహస్రనామములఁ బూజ సలుపుదుఁ గలికీ ! 92

గీ. ఓ చకోరిక ! పూర్ణచంద్రోదయంబు
అనుదినంబగు నాదు సౌధాంతరమున;
నమవసలు లేవు; కృష్ణపక్షములు లేవు
అనుభవింపంగఁ దగు నడ్డమాఁక లేక. 93

క. బాలిక లాడుచు నుండఁగఁ
గోలాటముఁ గాంచు మది యొకర్తుక యనె "మా
కాలంబున మే మాడిన
కోలాటముమం దిదొక్క కోలాటంబే ?" 94

మ. దినకృత్యంబులు నేసిచేసి
శ్రమచే దీలొంది నే గాఢని
ద్రను బొందంగ నెవండొ నన్వలచె ;
నేత్రంబుల్ తదానందమీ
లనముం బొందుట మేలుకాంచియుఁ
దగన్ లక్షింపలేనైతి వా
నిని ; జన్మంబున నిట్టి హాయెఱుఁగ ;
వెండిన్ వాఁడెటుల్ చేకుఱున్ ? 95

క. అరుగుదు దవులకు లెస్సగ
గుఱిగొన విలుకాఁడు వెనుకకుం జనినట్టుల్,
తరుణీ ! నీ దృక్శరములు
కరంబు నా యెడఁద లోఁతుగా నాఁటుకొనెన్. 96

క. చెలువుండు డాయుచుండఁగఁ
చెలి చనులుప్పొంగెఁ; బిగిలి చినిఁగె రయిక; యు
వ్విళు లూఱుచుండెనో ? కర
తలసమ్మర్దముల కవ్వి తడవోర్వ కెదన్. 97

క. అందిన పువ్వులు తన జడ,
కందని పూల్ దేవునికి సమర్పణ సేయున్
సుందరి; పండ్లను మాకుం
చుం దగ వాయన మొసంగుఁ జూ ! లేఁగాయల్. 98

క. చెలువుఁడు నాపైఁ బడరా
విలాసముగఁ దిరిగి వీఁపు వీపానిచి నే

నిలిచితి; నతండు నాకా
శలఁ జొరబడివచ్చి కౌఁగిళులతో నలిపెన్. 99

గీ. చెలువ పువ్వులు గోయుచు నలరుఁగొమ్మఁ,
దలిరుటాకుఁ దన చేయిగలిపి యూఁపుఁ;
జిలుకపలుకులలోఁ జేర్చి పలుకులాడుఁ
గడనె నడయాడు తన నంటుకానితోడ. 100

గీ. పులుఁగుకూఁతలఁ జదురైన బొజుఁగొకండు
దాఁటి గోడను జనుదెంచి తోఁటలోకి
గువ్వవలెఁ జిల్క చందానఁ గూయఁ, గొమ్మ
'పట్టుదు' నటంచుఁ జని తాన పట్టువడియె. 101

గీ. ముదితరో! నిన్ను నిడిన నాముద్దులెల్ల
వడ్డితో నేఁడు చెల్లింపవలయు నాకు;
ధరను ఋణశేష ముంచుట దగదఁటండ్రు
పెరుగు వామనమూర్తి మాదిరిగ వడ్డి. 102

క. పూచిన తంగేడన మెయి
నాచిన్నిమజంద లూని నగ, లెదురై దో
బూచుల నాడుచు నందక
నాచేతుల బెడిసిపఱచె నాఁచికొని యెదన్ 103

క. నినుఁ గనకముందె యతినై
మునినై వశినై జనుండు పొలుచును జుమ్మీ!
ననఁబోఁడి! మేనకాంగనఁ
గనక మునుపు పొదలినట్టి గాధేయుగతిన్. 104

గీ. తమినిఁ బ్రియురాలు నమలిన తమ్మలంబుఁ
గొనుదు స్మరదేవ నైవేద్యమునుగ నెంచి
యెది యనాచార మంచు గర్హితమొ క్షితినిఁ
బ్రియుల కదియె సదాచారమయి లసిల్లు. 105

క. పలుకులలో వస్తుధ్వని,
యలంకృతిధ్వని మనోహరాంగక్రియలన్,
లలిమోవి రసవ్యక్తియు
మెలంత ధ్వనికావ్యమంచు మెత్తురు రసికుల్. 106

క. చెలి! నీదు మువ్వ, లందెలు,
గలగలమని మ్రోసె గదినిఁ గతమే? మన సి
గ్గిలెనది; యన్య స్మరోత్సవ
ముల మంగళవాద్య ఘోషములనెన్ నగుచున్. 107

క. పొలయలుకల, సాంత్వనముల,
గిలిగింతలఁ గౌఁగిళులను, గేరడముల. ము
ద్దుల, సుద్దుల, దిద్దులఁ, బ్రొ
ద్దులు పుత్తురు వారు హద్దు తొలఁగఁగ నిచ్చల్. 108

ఆ. అమృతవల్లి వేమొ? అతివ! స్థాణువు నీదు
గాలిసోఁకు మాత్రఁ గదలఁ బాఱెఁ;
జెప్పనేల? తాఁకు నేకూర నయ్యది
చిగురుఁ దొడుగు నిరవశేషముగను. 109

గీ. సఖుఁడ! నా యంగకములందు సాంద్రపుణ్య
మాచరించెఁ; గృతార్థ మీ యధరపుటమె;

మొన్న మునిమాఁపు మా సందుమూలఁ గలిసి
ముద్దొసఁగిపోయె సాతానిముద్దుగుమ్మ. 110

క. తన వెనుకవచ్చు నన్నుం
జనుచుం ద్రిప్పుచు ముఖాంబుజము, స్వకటాక్షం
బను త్రాటఁ గట్టి వెంటం
గొనిపోవుచు నున్న యట్లు కోమలి నడచున్. 111

క. కని నా పుత్త్రిని నా పతి
తన పుత్త్రిం డనుచు సమ్మదముతోఁ బలుకా
డును; దత్స్వత్త్వము విని, కనుఁ
గొని నను నా మేనమామకొమరుఁడు నవ్వున్. 112

క. అతికోమలలతికాంగివి;
అతివా! దుర్వహములగు కుచాద్రుల వహియిం
చితివె? ట్లనఁ జెలి నవ్వుచు
"క్షితిఁ దీఁగకుఁ గాయ బరువె? చెలువుఁడ!" యనియెన్. 113

ఆ. అల్లుకొనియుఁ దరువు వల్లరి చిఱుగొమ్మ
సాఁచుఁ గౌఁగిలింప సరవి లాఁతిఁ;
దనకుఁ గూర్చుచున్నఁ దనపతి పూఁబోఁడి
ననువుకానిఁ బొంద మనసుపడును. 114

ఆ. ఇప్పపువ్వువోలె గుప్పుగుప్పున వీఁచుఁ
గొమ్మ! నీదు వలపు ముమ్మరముగ;
నున్న దొకవిశేష మన్నువు గలిగించు
నొక్క నాకుమాత్ర ముర్వియందు 115

ఆ. మాలకాకియంచు గేలి సేయంబడ్డ
బాలయయ్యె నింద్రనీలరత్న;
మదియె రాణియయ్యె హరికి నీలాదేవి
నాఁగ; సౌభగంబనంగ నదియె.

క. తన భర్తయుఁ దత్సఖుఁడును
వనమునఁ గూర్చుండ నొకట వచ్చి వెనుకగాఁ
దనపతికి మూసి కన్నులు
వనితామణి ముద్దొసంగె వాని సఖునికిన్.

క. అలరులఁ గోతము రమ్మని
చెలువుఁడు మఱఁదలినిఁ బొదకుఁ జేకొని చని కెం
దలిరని మోవినిఁ, బూగు
త్తు లంచుఁ జందోయిఁ జిదిమె ధూర్తత నగుచున్.

క. చనుచుండ విటుం డా వీ
థినిఁ దన మిద్దెదుటినుండి తెలిసియు దూరం
బని, యందఁ డనియు, దన చే
తినిఁ జాఁచెను గ్రింది కతివ తివ్వఁగ నతనిన్.

ఆ. వె. "బాల! పచ్చిమొగ్గ లేలతెచ్చితి? వద్దు;
వలపు పుట్ట"దన్నఁ బలికె నదియు
"నలరుఁజెండ్లు నీకు వలసినఁ గలవు మా
యక్కచెంతఁ జెప్పియంపుదు" నని.

---

'ప్రాప్తేతు షోడశే వర్షే గర్దభీ హ్యప్సరాయతే".

క. ఊరక గతానుగతికం
బారంభం గుఱిఁచి చూచినట్లుగ మెత్తు
ర్వారలు వీరలు; నాయువ
తీరత్నముకుఱువు వఱకె దీటగునేమో ? 121

క. ననఁబోఁడి లాఁతివారికిఁ
గన నందనిమ్రానిపండె; కానీ నా కో ?
తనరును నా యారామం
బునఁగల స్మరకల్పలతిక పొలుపున సతమున్. 122

గీ. నిలువుటద్దాల గదిమధ్య నిలిచి మేము
పెక్కు లవతారములను బ్రాపించితిమని
మదన సామ్రాజ్యమెల్లయు మాదుసొత్తె
యనుకొనుచుఁ బొంగుకొందుము మనసులందు. 123

ఆ. వె. కోఁడికూఁతగూసి, గోదావరిమునుంగఁ
దలఁచు నాదుమగని నిలువెలార్చి
ప్రియుఁడు శక్రుఁడట్లు విచ్చేసి నిసియందు
నను నహల్యఁ జేసికొనియె, నగుచు. 124

క. కొమ్మలఁ బూవుంగొమ్మయి,
బొమ్మలలోపలఁ బసిండి బొమ్మయి, లతలం
దిమ్మగ విద్యుల్లతయయి,
సమ్మదమిడు మనసుఁజొచ్చి సఖ క్రుమ్మఱుచున్. 125

క. కనకాంగీ ! నిలువకు ప్రాం
గణమున; మన యిరుగుపొరుగు గరితలు నిన్నుం

గన దిష్టి దగులుఁ జుమ్మీ!
మన పువ్వులతోఁట కరుగుమా! తడయకిటన్.

క. తరుణిమొగంబునఁ గల క
స్తురినామము బొమలవింటఁ దొడిగిన శరమై
గుఱిగొని నా డెందంబున
నరుంతుదము నాఁటుకొని మహావ్యథఁ గొలిపెన్

ఆ. వె. "కొమ్మసందులిందిగో గూఁడొకండుండెఁ
గాంచు" మనుచుఁజూపెఁ గలికి; ప్రియుఁడు
"గొమ్మసందు లిందిగో! గూఁడు గన్గొంటి"
ననుచు నవ్వ వ్రాల్చె నతివ మోము.

క. తొడి, పూసి, కట్టి, గదిలోఁ
బడఁతి రతివ్రతముఁ బూని వచ్చిన నాకున్
విడియముతో స్తనఫలములఁ
గడానిమెయి దక్షిణగఁ దగన్ దాన మిడెన్.

క. కుఱువుల మీఁదన కూర్చొను;
నురంబునన నిద్రనెందు; నూఁతఁగొనియ నా
కరమును జరించు; నిటు సుం
దరీమణి మదంగశాఖ నా విలసిల్లున్.

క. నన చెండ్లొ? దబ్బపండ్లో?
మనోజుని పసిండిగిండ్లొ? మరి యేవో? నీ
వన నవ్వుచు ననె సుందరి
"స్తనశల్య పరీక్షనేయఁ దలఁతె? రసికుఁడా!"

క. కనుగీటులు, జడవ్రేటులు,
ననవరతం బొడలినీటు, లమృతపుఁజూటల్,
పెనునవ్వులాట, లియ్యవి
ననఁబోఁడికిఁ జాలఁ జిన్ననాఁడే యబ్బెన్. 132

క. అగపడిరి యొంటిపాటున;
నెగఁబడిరి యొకళ్ళొకళ్ళ; కెవ్వరిలో నె
వ్వగ నెవ్వరు చొరఁబడిరో ?
పగలో ? రేయో ? యెఱుంగఁబడ దా కవకున్ 133

ఆ. పాండురాజు దాని పతి; కుంతి యా యింతి;
తదనుమతినిఁ బడసి దయితవరుల
సాధ్వి యయ్యెఁ, మగని సమ్మతిఁ జేసిన
పాపమునను బుణ్యఫలము గలుగు. 134

క. తిరిగెను ముదిరినరోగము
పరికించినమాత్రఁ; బ్రియుని స్పర్శముచేతన్
తరుణి సుధారస మానిన
కరణినిఁ దేఱుకొని కడిఁది కళకళలాడెన్. 135

క. అవునని కాదని వాదో
పవాదము లొనర్పఁ బతియుఁ బ్రతివేశియునుం
బువుఁబోడి సమర్థించెను
దవిలి యెదిరిపక్ష మఱక దానిపతి యెదన్ 136

క. కొనుఁ గ్రొత్తక్రొత్తచీరెలు;
ననర్ఘ భూషలును బ్రత్యహంబును; మగనిన్

ధనమడుగదంట; యది కాం
చనాంగిగద! వృథగ నేల సంకోచింపక.

గీ. మట్టిఁ బుట్టినదైన క్రొమ్మానికంబు
సానలందీఱికాదె యౌజ్జ్వల్య మొందుఁ;
బల్లెటూరం జనించిన పిల్లవుగద!
రాపిడులఁగాక రసికతాప్రాప్తి యెట్లు?

గీ. నిలిపి పూసెజ్జపీఁటపై నీటుగాని
స్మితసుమంబుల నర్చించి, చెలువుచిందు
కనుకలువదండలిడి, నివేదన మొనర్చె
స్తనఫలంబుల, నధరామృతమును రమణి.

గీ. "కలికి హరియించి నాదుబంగారుగిండ్లు
దనజిలుఁగుపయ్యెటంగప్పిఁ దాఁచె నవిగో!
అరఁటిబోదె లిగో! మాటెఁ గుఱువులందు
దొంగయిది" యంచుఁ జెఱఁబోసె దొరయొకండు.

గీ. అక్కగదికిఁ బోయి యట గోడఁ బ్రేలాడు
చిత్రబంధములను జెల్లెలు గని
"బావ! యక్కతోడ నీవాడినాటలు
గఱపు నా" కటంచు దఱిసి యడిగె.

క. హరిణివలె బెదరుదేటికె?
కిరాతుఁడనుగాను; గ్రూరకేసరిఁగా; నో
తరుణీ; కొలుతును నామం
దిరంబునఁ బ్రతిష్ఠ సేసి దేవివలె నినున్.

క. తనయింటి కేఁగ మాయిం
టినుండి పయనమయి వాకిటికి నొంటిగ వ
చ్చిన ననుఁగని యపశకునం
బని నా మేనత్తకూఁతురాఁగెను రేయిన్. 143

గీ. వచ్చి కొంపోయి కామునిపండుగంచు
నుంచుకొనె నన్ను మాబావ; ముంచియెత్తెఁ
గట్న కానుకలతో; నాకుఁ గ్రమ్మఱిల్ల
మనసు రాదయ్యె మాయక్క యనిపెఁగాని. 144

గీ. "హృదయ చోరుండ; వందితి; వదల" ననుచుఁ
గలికి మొలనూలిచేత రెక్కలనుగట్టి
విరుల జడపేరి కళతోడ వీపుపెట్ల
బాది, ననుఖైదుఁగావించెఁ బడకటింట. 145

గీ. తరుణుఁ డపరంజిబొమ్మల దంపతులను
బట్టుకొని కేలుజంటతో, ముట్టఁజేయు;
ముద్దు వెట్టించు; మోవియు మోవిఁ గలుపు;
గౌఁగిలింపించు; మెలుచు నా కడను నగుచు. 146

క. కనఁబడఁగ నీవి సడలెను;
జనుదేరఁగఁ గడకుఁ బిగిలెఁ జనుకట్టు దగన్;
దను వంటఁ బులకరించితి;
ననుఁ దెలియఁగనైతిఁ బైకొనం బ్రియుఁడు చెలీ! 147

క. ననుఁ గాంచుచు యువతీమణి
తన యేకావళినిఁ గరలతం ద్రిప్పుచు నుం

డెను; జపియించుచు నుండెనొ ?
తనయెద జపమాల గొని మదనమంత్రంబున్ ? 148

ఆ. నన్ను డాయు నదనఁ జిన్నారిపొన్నారి
యన్నుమిన్నయగును హరిణయాన;
కదలిపోవు వేళ గజయాన; సఖులతో
సంచరించు నప్పు డంచయాన. 149

ఆ. "పిట్టగోడ వెనుకతట్టున నవ్యచం
ద్రోదయంబు; చూడు మొప్పులాఁడి !
పట్టియిత్తు నీకుఁ బదవమ్మ !" యని దాసి
యతివఁ దెచ్చి విటుని కంటఁ బెట్టె. 150

క. నీ చిన్నెలు, నీ వన్నెలు,
నీ చిక్కని మెయిపసందు, నీ చందోయిన్,
నీ చిలుకపలుకు లోచెలి !
దాఁచితి వే భాగ్యశాలితరుణుని కొఱకై ? 151

ఆ. క్రొత్తరీతి జడలుఁ; గ్రొత్తచందంబుల
చీర కట్టుఁ; గ్రొత్తతీరు రయిక,
లింకఁ గ్రొత్తబొట్టు, లిందీవరాక్షి ర
చించు; దాని ప్రతిభఁ జెప్పఁ దరమె ? 152

గీ. దేహశీదత్త దీపంబు తెఱఁగు దోఁపఁ
గడపపయి నిల్చితివి; కాని కలికిమిన్న !
నీదు ముఖదీప్తి యెల్లయు వీది పయికి
మాత్ర; మందును నా పైకిమాత్ర నిగుడు. 153

క. స్మరుఁ డుంట విల్లుగాఁ గొని
తరుణీ! నీ మెయిని, నల్లెత్రాడుగ ముక్తా
సరముఁ గొని జోడుగుండ్లుగ
విరచించి కుచద్వయంబు విసరును నాపై. 154

ఆ. వెలఁది! పొడుపుకతను విప్పుదే? "అతిరహ
స్యంబు బట్టబయ" లటంచుఁ బలుక
నలరుఁబోఁడి నవ్వు చనె "దీని కుత్తరం
బడరు రతిరహస్యమం" దటంచు. 155

క. మొలనూలిమువ్వ లందెలు
గలగలమన నెగసి త్రోసి కలికీ! నన్నున్
సలుపుదు వీరాయితము; న
బలవగు నీ కేన్గుబలము వచ్చె నదెట్టుల్? 156

క. తరుణీ! మెఱుంగు దీపము
కరణిని నీ వలరఁ, గన్నుఁగలువలదండల్
వరలం దోరణలై మం
దిరమునఁ బునరుక్తి లాఁతి దీపాదు లగున్. 157

క. మెఱుఁగుఁజిలుంగు పీతాం
బరంబు ధరియించితివా? భవత్తనుకనక
స్ఫురదురుసుషమాపుంజమొ?
నిరూపణ మొనర్పఁ జాల నిపుణత రమణీ! 158

ఆ. వె. చింకిపాఁతయైనఁ జింపిరి తలయైన,
నల్లపూసయైన, ననవిలుతుఁడు

పడఁతిగుబ్బచనులపయి నెక్కి వీఁకతోఁ
బేరణిని నటించుఁ బెక్కులేల ? 159

చ. కరముల నెత్తి మ్రోఁగఁ గటకంబులు
రైకను విప్పుచున్న, మేన
విఱుచుచునున్నఁ, బెన్నెఱుల
పిండును గ్రొమ్ముడి గట్టుచున్న, నా
సరసుఁడు చక్రవాకముల చందమునన్
విరిచెండ్లతీరునం
బరగెడు నాయురోజములఁ బట్టు
హఠాత్తుగఁ ద్రోసి పైఁబడున్. 160

క. వలఁ బన్ని చెఱువునం జేఁ
పలు వట్టుచునుండెఁ బడఁతి; పడెను దదంగో
జ్జ్వలవిభ్రమజాలంబునఁ
బలు యువమీనములు; వడసె ఫల మిబ్బడిగా. 161

క. మలయానిలంబునకె యిటు
చలించె నీగాత్రలతిక శ్యామామణిరో!
నిలువుము నాచేతులప్రాఁ
కుల ; నీ కకుతోభయంబగుఁ దుపానులలోన్. 162

క. "భువి జరతులకుం గావలె
యువతుల నిక్కిన వలుందయురసిజములకున్
రవికేల ? యంచుఁ బ్రతివే
శవధూమణి తాల్చు సన్నజాలె పయంటన్. 163

క. కని ప్రియు సరసాభ్రమువలె,
వినియును బలుకుటుమునట్లు విరిబోఁడి ముదం
బునఁ గేఁకరించు ; లాస్యం
బొనర్చు నెమిలివలె దౌలనుండి యవశయై. 164

క. సరసుల నెందఱఁ గలిసినఁ
జరిత్ర దూషితముగాద శాస్త్రీయముగా
ధర ద్రౌపదికినివలె; నె
వ్వరిఁ గలియునొ వాఁడె తనకుఁ బతియనుకొనుచోఁ. 165

గీ. మోమునకుఁ జందురుఁడు, నేత్రములకుఁ గలువ
లద్దములు చెక్కులకుఁ, దలిరాకు మోవి,
కురసిజములకు విరిచెండ్లు, మెఱుపు మెయికిఁ,
జుట్టములు గొమ్మ ! చుట్టాలసురభి గదవె : 166

గీ. పూలపావడఁ దాలిచి, పూలపైఁట
వయిచి, చందోయికినిఁ బూలరయికఁ దొడిగి
పూలమాలలు గై నేసి పూవుఁబోఁడి
పొలుచుఁ బువ్విల్తుశరముల మునిఁగినట్లు. 167

మ. కనులం గీటుచుఁ, దిర్గిచూచుచును,
రాకల్పోకలుం జేయుచుః
బనివడ్డట్టులు, వీడెపుః వలపు
గ్రమ్మః దాసి చిర్నవ్వుతో
డను బ్రశ్నించుచు, మెల్చి వాతెఱను
బంటః నొక్కుకొం చుంద్రు; మో

హిని వోలెన్ మొగసాల నిల్చిన
ననున్ వీక్షించుచుం గాముకుల్. 168

ఆ. "కొమ్మ కెక్కి పూలగుత్తులం గోయరా!
వలపుకాఁడ!" యంచుఁ బలికి చూప
నెగిరి పైకి మగువ బిగివట్ర గుబ్బ చ
న్గవను బట్టెఁ "గొమ్మ గదవె" యంచు. 169

క. విరిమొగ్గఁ దేఁటి కరణిని
సరసుఁడు నా పైని వ్రాలి, చక్కిలిగింతల్
విరచించుచు నవ్వించును;
స్ఫురదధరామృతముఁ గ్రోలుచును జొక్కించున్. 170

క. కలబందమొలకచెలువునఁ
జెలి వాడక, కోమలికము చెడ, కయ్యను బి
ల్లలతల్లి శోభనపుఁ బెం
డిలి కూఁతురు పగిది విటునిడెందముఁ గలఁచున్. 171

క. తన కైదండను మెలియిం
చి నాథుకై దండఁ జెలుల సిగబంతి చరిం
చును వీధి; వానినేమో
హినియే నీడ్చుకొనిపోవునేమొ? యను మదిన్. 172

చ. వలువ దొలంగఁగా నురముపై
నిదురించెడువేళఁ జూచినా
చిలిపిమఱంది బాలకుఁడు
చేతులువైచెను; మేలుకాంచు న

న్నళుకుచుఁ జూడ జాలిగొని
యాస్యముఁదీర్చితిఁ; బోరఁదయ్యె న
ర్మిలిఁ గనవచ్చెఁ బ్రోడగ;
మరీచకణంబును దీక్ష్ణమేకదా! 173

క. కనకాంగి నీదుకోమలి;
యనర్ఘరత్నంబు తనయ; యార్యా! యేలా
ధనమునకు దేబిరింతువు?
తనరఁగ నవనీతమిఁక ఘృతమునకుఁ గొఱయే? 174

క. ఈఁదాడనఁ గోదాడని
వాదాడు లతాంగి సందె వ్రాలుడుఁ బతితో
నీఁదాడన నీఁదాడను;
గోఁదాడనఁ బలుకు "నిజము గోదా"దనుచున్. 175

క. ఏకువలె మృదులగాత్రివి;
మేకువలెన్ గ్రుచ్చుకొంటి మిక్కిలియు నెదన్
నా కేకు మేకయినదను
లోకోక్తి సమన్వయించె లోలాక్షి! తగన్ 176

క. తననీడ నాపయింబడఁ
దనపై నా నీడపడగఁ దరుణుడు సఖి! నా
మునువెనుకలకుం బఱచుచు
ననుఁ గౌఁగిలిగొన్నవిధమునన్ ముదమొందున్. 177

గీ. 'దిష్టికొట్టిన'దని యొక్క తేప 'గాలి
సోఁకె'నని 'రేయి జడిసెఁ బెంజీఁకటి'నని

తనదు ముత్తవ్వ గొనిరాఁగఁ దరియు నన్ను
రక్షకని తీర్థమునకని రమణి రేల. 178

క. ఇలువెడలు నాకు వాఁకిటఁ
జెలి యెదురయి శకునమొసఁగుఁ జేతిశిశువుతోఁ;
జిలికించుచుఁ జిర్నవ్వులఁ
గలంచు నను; నగుచు శిశువుకరమునఁ బిలుచున్. 179

ఆ. అవధి దినముసెల్లె; నారాతిరియు నేఁగె;
వారమట్లు జరిగెఁ; బక్ష మరిగె;
నెలయుఁ గడచెః నాదు చెలువుండు రాఁడయ్యె
నెవతె చేతులందు నిఱికికొనెనొ ? 180

క. ఇరువురి జ్ఞానేంద్రియములు,
నిరువురి కర్మేంద్రియములు నేకంబయ్యెన్
దరుణీతరుణులు వేఱుగఁ
బరికింపఁగరారు నీరుఁ బాలుం బోలెన్. 181

క. వలసిన గతి సాఁగుచు, మెలి
కలు దిరుగుచు, వింటిబద్దగతి వంగు చొగిన్
నెలతుఁక జంత్రపు బొమ్మను
దలఁపించుచునుండు మన్మథక్రీడలలోన్. 182

క. "కొనితెమ్మ! లేవు పండ్లిం
ట" నటంచుం బలుకఁగా మిటారి, ప్రియుండా
డెను నగుచు నివిగో! యీ కొ
మ్మనుండె రెం; డేను గోతు మాపట" ననుచున్. 183

క. నడచుచుఁ గాల్మెలివడెనని
పడంతి గూర్చుండి, స్వీయబాహుయుగంబున్
ఇడి వెన్కనుండి చంకల
నొడిసి కుచములెత్తు స్వప్రియుం గని నవ్వెన్. 184

క. కలిసితి మొంటిగ సందున
వెలంది లతవోలె నన్నుఁ బెనవేసికొనెన్;
అలికిడి రవంత దోఁపఁగఁ
జెలువుగఁ బావడను దూఱిచి ననుం దాఁచెన్. 185

ఆ. చెట్ల చీరఁ దాల్చి చెలువుఁ జిమ్ముచుఁ గొమ్మ
హొయలు చిందు పూలరయికఁ దొడిగి
గుమ్మమందు నిలువ నెమ్మెకాఁ దేతెంచి
చేయిసాఁచె విరులఁ జిదుము వేడ్క. 186

క. సుతరాము దివా సంధ్యా
రతి తగదందురని పలుక రమణుఁ "ఏకాలే
కృత మకృతం స్యా" త్తను పం
డిత వాక్యము గలదటంచు నెలఁతుక నవ్వెన్. 187

క. నా గాత్రయష్టి నీ మైఁ
దీఁగను బ్రాఁకింపుమీ! సతీమణి! మదనో
ద్వేగము పేరి ప్రభంజన
వేగంబున కూఁగియూఁగి పెంపఱకుండన్. 188

క. జడనుండి పడ్డ పూవును
బడఁతి పదాగ్రమున మీఁటి పడఁగా నాపై

నెడఁదాఁకి పచ్చిపుండయి
పడుచుండగ బాధఁ జూచి పకపక నవ్వెన్. 189

క. అలరుంగొమ్మరొ! యిగొ! కొఁ
గిలింతువే యాకసంబుఁ? గేల్దూసుక ద
వ్వులకుం బఱతువు; కఱచితె
విలాసినులచెలిమిఁ జేసి విభ్రమవితతిన్? 190

ఆ. పుణ్యయాత్ర పూవుఁబోదకుఁ; బారాయణ
గ్రంథమార్షమైన కామసూత్ర;
మతివమూర్తి ధ్యేయ; మగు నీవిమోక్షమే
మోక్షమండ్రు తరుణబుధవరునకు. 191

క. మదిరాక్షి నెచటఁ గాంతునొ
కద! యని చింతిలుచు దాఁటి గడపం దిగ నా
డఁ దలంచిన తీర్థంబే
యెదురై యేతెంచినట్టు లెదురుగ వచ్చెన్. 192

గీ. చందురుఁడు మోము; కన్నులు సరసిజములు;
దనువు వల్లరి; గిరిజంట స్తనయుగంబు;
కౌ నది చిదంబర రహస్యమౌ నటందు
రతివ! చిత్రాంగి వీవెకా కన్య యెవతె? 193

క. చూడక చూచును నను; మా
టాడక మాటాడుఁ; జేయనట్టులు నేయుం
జేడియ చేసన్నల; నిటు
వీడియమును నమలు చింటి వెలుపల నిలుచున్. 194

ఆ. పసిఁడికొండఁ గరఁగి బ్రహ్మ సృజించెనో?
చందమామనుండి జాఱిపడెనొ?
మోహనాంగి పూవుఁబోదకుఁ బుట్టెనొ? కాక
యిట్టి సొగసు సొంపు లెందుఁ గలవు? 195

ఆ. పంచెవన్నెచిలుక భాతిఁ జిత్రాంబర
మును ధరించి కులుకుకొనుచుఁ గలికి
పలుకులందుఁ దేనె లొలికించుచును నాదు
కేల వ్రాలి చేసెఁ జాల ముద్దు. 196

క. పొరుగూరినుండి తనపతి
యరుదేర నతర్కితముగ నంగనసన్నం
బరుగిడువానిని విటుఁ గ
న్బఱచి "యిగో! దొంగ! దొంగ!" పట్టని యఱచెన్. 197

గీ. తరుణి ముఖచంద్రునుండి స్మితంబు పేరి
యమృతపూరంబు ప్రవహించు; ననవరతము
మునకలాడుదు; ద్రావుదుం దనివి దీఱ
దివ్యభావంబుఁ బొందిన తెఱఁగుఁగొందు. 198

గీ. ఇంతి వీడ్కోలొసంగు ముద్దిచ్చి నాకు;
స్వాగతం బిచ్చు నేరాఁగఁ గౌఁగిలించి
చీరచెరఁగున విసరుచుఁ జెమటలార్చి
శ్రమను దొలఁగించు నధరామృతము నొసంగి. 199

క. చిరిగిన రయికే తొడుగును;
చిరిగిన చీరే ధరించుఁ జిలిపితనముతోఁ

దరుణి; చనుంగవ, కుఱువులు,
పిఱుందులుం గానరాఁగఁ బ్రియునకు నింటన్. 200

క. తలవాఁకిట నిలువంబడి
లలన బెళుకుచూపుల వలల విసరి వీథిన్
సలిలాశయమున వలెఁ దగ
వలకాంద్రనుశఫరములను బట్టఁగఁ జూచున్. 201

క. ప్రమదా! నీకుఱు వాలా
నముగాఁగొని కట్టివేతు నాగాత్రగజేం
ద్రము; కాకున్న భవద్దే
హమహస్సరసినిఁ గలంచు నత్యంతంబున్. 202

చ. నడకలఁ గ్రొత్త క్రొత్త రచనల్
విరచించెదు; నాటపాటలం
గడుఁగడుఁ బారభేదములఁ
గల్పనసేయును; వేషభాషలం
గడియ కొకొక్క చందమును
గన్పఱచుం; గనువిందుసేయు నె
ప్పుడుఁ బ్రతివేళసుందరి
యపూర్వవిలాసినిగా జనాళికిన్. 203

గీ. తళుకుమాసినఁ బసిఁడికి ధర తఱుగునె?
పొంగుదీసిన వంకకుఁ బొలుపు నెడునె?
జవ్వనవునిండు దీసిన సహజమైన
నిగ్గుదగ్గక నీవు గన్పింతు వింతి! 204

ఆ. కాదు పసిఁడిబొమ్మ; కాదు చిత్తరుబొమ్మ;
కాదు పూవుఁగొమ్మ; నాదు కొమ్మ
సర్వ మధురమైన చక్కెరబొమ్మ; ది
వ్యామృతస్రవమ్మ యగు నిజమ్ము. 205

గీ. పద్మినీ ! నీవు రాత్రికిఁ బనికిరావు;
కైరవిణి ! నీవు పగటికిం గావుగాదె !
పద్మముఖి, కల్వకంటి నా పడఁతిమిన్న
లెస్స వికసించి రేబవల్ ప్రీతిఁగొలుపు. 206

క. వలసి తలయూచు వలదని;
పలుకును జెలి నోరువిప్పి పలుకక కనుగ్రే
వల, నెదుట నవ్వకయు నో
రలు వారఁగ నవ్వు; దీని రహి వింత గదా ! 207

క. సరిదిద్దక జాఱిన యు
త్తరీయపటము, ముడియూడు స్తనకంచుకముం
దరుణి బిగింపక, ప్రియుకడ
కరుదెంచును బనివడిన క్రియం బలుతూరుల్. 208

క. అలకలు సెదరియుఁ, జెరిగియు
దిలకము, మాసియును జిలుఁగుతెలిచీర బళా !
ఒలికించుఁ గలికి చెలువము;
విలాసినికి వికృతియేని వింతసొగసిడున్. 209

మ. అల యుర్వీజలతల్వలెం బెనఁగి
యన్యోన్యంబు, నిల్చుండి త

మ్మలమున్ నెమ్మి మొగంబులం
దునుచుచున్ మాద్యన్మతిన్ బాహువ
ల్లులఁ గంఠంబులఁజుట్టి వాతెఱ
సుధల్ క్రోల్కొంచు, ముద్దాడు కొం
చెలమిం దూఱుచు మేనులం
బెనఁగుచుం బ్రేకాంతసీమం బ్రియుల్. 210

క. "విరిపాన్పు పఱచి తేటికె ?
నిరతముఁ గావింతు వీవు నృత్యంబును నా
యురమందె" యనఁగ ననె సుం
దరి "నవ మదనుఁడవు వలదె ? నారాచంబుల్" 211

క. శోభనపుఁబెండ్లి పీఁటకు
నా భామను దేరఁ జెలులు నట్టింటికిఁ బోన్
శోభావతి ప్రతివేశిని
యా భూమికఁ దాల్చివచ్చి యటఁ గూర్చుఁడెన్. 212

గీ. కన్నుఁదమ్ములుఁ, జూపులకలువదండ,
ముక్కుసంపెంగ, గుబ్బచన్నులబంతు,
లరుదు పొక్కిలిసురపొన్నవిరియు నమ్మ
పుష్పలావిక యయ్యె నప్పువ్వుఁబోఁడి. 213

క. తమమిద్దెనుండి మామి
ద్దెమీఁది కామింట వారధిం గట్టె నపాం
గములం జెలి; లాఁతి కగ
మ్యమగోచర మొక్క నాకు మాత్ర మగపడుఁజా. 214

మ. తొలినాఁ డంగన నిల్చె,
దేశికునకున్ దూరప్రదేశంబునన్;
మలినాఁ డొక్క రవంత ముందు జరిగెన్;
మర్నాఁడిఁకం గొంత ముం
గలికిన్; నాలవనాఁడు మిక్కిలియు
సాఁగం జొచ్చె మున్ముందు; క
వ్వలఁ గొన్నాళ్ళకు వాని
యంకతలముం బ్రాపింప నుంకించెనో? 215

గీ. వచ్చి ముదిపతి తనమిద్దెఁ బడకటింటఁ
దనపడఁతిచిత్తరువుబొమ్మఁ దఱిసి బ్రమసి
యంటి చందోయి, మోము ముద్దాడుచుండెఁ;
దాని ముద్దాడుచుండె సుందరుఁడు తోఁట. 216

క. చిఱునవ్వులు, హాస్యంబులు,
సురుచిరలీలావిలాస శోభ లివెల్లం
బరికింపఁ దోఁచు మదనుఁడు
విరిబోఁడి యెదందఁ బీఁటవెట్టె నటంచున్ 217

క. నడచినఁ, గూర్చుండిన, నిలఁ
బడినం బడుకొన్న నదుకఁబడినపగిది నె
ప్పుడు విజ్జోడయి పాయక
పడఁతియు నే జంటబొమలవలె నుందు మొగిన్. 218

క. నినుఁ జూచిన చూపులతో
ననబోఁడీ! వేల్పుటంగనలఁ గనుగొన్నన్

మును దేనియ నానిన జి
హ్వను క్షారజలంబు నానిన శ్లేవగదే ! 219

క. పనిఁ జేయుచుఁ జేయుచు వ
చ్చును; గుబ్బల గ్రుచ్చు నవ్వుచును మాటలసం
దున; నిలువంబడు జెలి త్రో
వను; దను ముద్దాడి పోవవలెనని యేమో ? 220

క. రమ్మని సంకేతమునకుఁ
గమ్మం బంపంగ నొక్కకలికికి, దానిం
గొమ్మ మరొక్కతెగొని కుం
జమ్మున దుర్లభుని విటుని సాధించుకొనెన్. 221

ఆ. తలిరుఁబోఁడి క్షేమతండులంబు లివంచు
ముద్దులిచ్చె నాకు మూటగట్టి;
నా ప్రయాణమందు, నాదు కార్యములందు
జయముపై జయంబు సంభవించె. 222

క. పిలువఁగఁ బేరంటమునకు
వెలఁది యొకతెవచ్చి గేహభిత్తినిఁగల నా
చెలిచిత్రమునకు బొట్టిడి
కలికినిఁగని యవలబొందెఁ గడుఁ దబ్బిబ్బున్. 223

క. ననఁబోండ్లకు నెలనెలకున్
దినత్రయమ శోభనం; బది గతించిన శో
భనములపై శోభనములె
దినదినమని మరుఁడు దంపతిస్మృతి వ్రాసెన్. 224

క. ఒకతూరి యొద్దెం జెక్కి;
శ్శోకతఁ దన యధరబింబ; మొకపరి చనుదో;
యొకతడవఁ దొడల; నివ్విధి
సకి నాతో జూదమాడి సకలంబోడెన్. 225

చ. ప్రియునితలం దలాఁడగను
బ్రేయసి పండుకొనుం; దదీయమౌ
చెయి మెడచుట్టు వైచుకొనుఁ;
జేరులుగాఁ దనకేలఁదోయి నా
ప్రియు గళమందు వ్రేల్చుఁ; గొను
బిగ్గకవుంగిలి; నొత్తుకొంచుఁ దా
మెయిమెయిఁ గూరుచుండును దమిం;
దనివింగొన దేమొనర్చినన్. 226

ఆ. అత్తఁ జూచి కోడ లా యిద్దరిం జూచి
పుత్రి వంశధర్మముగ దలంచి
కామ్యకర్మములను గావించుచుందురు
ఋత్విజులకు వలయు నెల్లనిచ్చి. 227

క. కని దానిని నవ్వని వా
రును, రోయనివారులేరు; ప్రొద్దులు తిరిగెన్,
ధనపతి తలపువ్వయ్యె; న
వని నవ్విన నాఁపచేనె పండినదయ్యెన్. 228

క. ప్రియురాలి మదనలేఖలు
జయపత్త్రిక లనెడి సంతసముతో వ్రేల్తున్

శయనగృహంబున; సలుపుదు
నియతిం బారాయణంబు నే రాతిరులన్. 229

క. చక్కెరబొమ్మ యిగో ! కను !
చక్కని సరసులఁ గ్రయించు జతనముతోడన్
మిక్కిలియగు మెయిపెక్కుల
రొక్కముతోఁ బణ్యవీథిఁ గ్రుమ్మఱుచుండెన్. 230

ఆ. స్వకరరేఖ లరసి సాముద్రికుఁ డొకండు
"బాల ! సుభగ వీవు పలుకనేల ?"
అని వచింపఁ గన్నె మనసున మురియుచు
"నది ఫలించు నెప్పు" డంచు నడిగె. 231

క. ఇది యామయమొ ? యనుక్షణ
మెదుగుచు నీ చన్నుదోయి యిముడదు రయికం;
దుదిమొగము మూఁత వడునో ?
సుదతీమణి! పట్టి యొత్తి చూచెద రమ్మా ! 232

క. బంతాటయందు విసరితి
బంతిని నే నొకటి; జోడుబంతులు విసరెం
గాంతామణి; నా చేతకుఁ
బంతంబున నిబ్బడిగను బ్రతినేయు నిటుల్ 233

ఆ. అక్కపురుడు వోయ నరుదెంచి చెల్లెలు
సవతి యయ్యె నాల్గు దివసములకె;
పట్టమహిషి యయ్యెఁ బదినాళ్ళ; దాని సౌ
భగము సూచుచుండఁ బగలఁబండె. 234

ఆ. "చిట్టిపాప ! నాకుఁ జెపు మమ్మబిడ్డవా ?
నాన్నబిడ్డవా ?" యనంగ నదియు
"నమ్మబిడ్డ" నంచు ననె "నెట్లు దెలిసె ర
హస్య ?" మంచు నవ్వె రచటి చెలులు. 235

క. ప్రియురాలి యుత్తరీయముఁ
గయినేసి కురంగనాభి గంధిలమును రాఁ
జయజయనాద మొనర్చుచుఁ
బ్రియులు ననుఁ మెచ్చుకొనిరి కృతపుణ్యునిగాఁ. 236

గీ. "ప్రియుఁడ ! నాయాటఁగట్టింతువే ? యెది ? యెది ?
ఆడుదము రమ్మ ! చదరంగ" మనుడుఁ బడఁతి
"కాదె చిత్రంబు ? ప్రేయసీ ! కలికి యెట్లు
పురుషుఁగట్టించు ?" నన నవ్వ మోముఁ దాల్చె. 237

క. "వినలేదె ? సఖీ ! 'కళ్యా
ర్చిన దిల్లార్చు' నను బుధవరేణుల సూక్తిఁ"
అన నగుచుఁ బ్రియుం, డా జ
వ్వని కళ్యార్చును గడింది పకపకనగుచుఁ. 238

గీ. చెలువ మృదుగాత్రయష్టి నిశ్రేణినట్టు
లెట్టకేలకు నెక్కు; నెట్టెట్టొ దిగును;
మరలనెక్కును; దిగుచుండు మరల నట్లె
వెడఁగునుంబోలి నాచూపు పెద్దనేపు. 239

క. "ఎది కావలె నీ ?" కనఁ బ్రియుఁ
"డది కావలె" ననియె నగుచు నబ్జాస్య, యతం

"డదియే ?" మన "నది ? యదె ?" యని
ముదిత నగన్ మెల్ల నతఁడు ముద్దిచ్చి చనెన్. 240

చ. అల ప్రతివేశికాంతకు
గృహంబున నిద్దుర పట్టదంట; య
న్నెలవున నగ్నిమధ్యమున
నిల్చిన యట్టులె యుండునంట; శీ
తల పవనంబు సోఁకుచు
సుధాహ్రద మట్లు సెలంగునంట మా
యిలు; వచియించు చివ్విధి
శయించుఁ బగంటను వచ్చి వేసవిన్. 241

గీ. పద్మపత్త్రాయతంబులై పరిఢవిల్లు
చారులోచనయుగళంబు చాలకేమొ ?
తాల్చి యుపలోచనములను దరుణకోటి
వాడవాడల శోధించుఁ బద్మగంధి. 242

క. దిక్కులఁ గ్రక్కఁగఁ గురువుల
చక్కందనమెల్లఁ బట్టుజాలెపరికిణీ;
టెక్కెంబన వలజేనికిఁ
జక్కనిచుక్క యిదె ! చంద్రశాలఁ జరించున్. 243

క. బలిసి, కడు విజ్జువీఁగుచు
లలితములయి, పఁసిడిగిండ్ల లాగునఁ దగు గు
బ్బల నద్దంబునఁ గాంచుచుఁ
గలికి తనదు భాగ్యమునకుఁ గడుఁగడు మురియున్ 244

తే. ఒక్క యచ్చున దించినట్లింద్రు నాదు
నిగురుఁబోడియుఁ బ్రక్కింటి చిగురుఁబోణి
నన్ను భ్రమగొల్పుచుండు నా వన్నెలాఁడి
తాల్చి వల్వలు నాచెల్వ దాల్చినట్లె. 245

క. అమవస నిసియేనియుఁ బు
న్నమనిసియే నాకు; వెలుఁగ నా రమణీ ర
త్నము రమ్యముఖేందువుతోఁ,
గమనీయస్మితముపేరి కౌముదితోడన్. 246

క. వ్యవహారదశను ద్వైతం
బవనిం బరమార్థమందు నద్వైతమ; మా
కవ కద్వైతమె సర్వ
వ్యవహారావస్థలందు భాసిలుచుండున్. 247

క. "మేకువలె నుంటి విందా
కేకైతి విదేల"యనుచు హృదయేశుఁ డనన్
"ఏకెప్పుడు మేకయ్యెనొ
మేకేకగు టెఱిదె ?" యంచు మెలఁతుక నవ్వెన్. 248

చ. ఒకపరివచ్చి యద్దమున
కున్ముఖియై సవరించి ముంగురుల్;
ఒకపరివిప్పి రైకను
మఱొ్కకటిదాలిచి; దిద్ది హారముల్
ఒకతఱిఁ జీరమార్చియు
మఱొకవితంబుగఁగట్టి; యద్ది నె

మ్మొకమున గంధచూర్ణమును
ముద్దియ నాకిడు వచ్చి ముద్దులన్. 249

క. ఒకకంటి కిడితి కాటుక;
నొకచెవికే కమ్మఁదొడిగి; తుంచితివి విశే
షకమును సగంబె; శేషం
బిఁక ననుఁ బూరింపమందువే? పూఁబోఁడీ! 250

క. "పొరుగింటిపడుచుఁ దన చి
త్తరువుసరస నిలుపుకొనియెఁ దమిమెయి నీ చి
త్తరువు దొరా! రొమ్ములనిడి
పరుండు రే"లంచు దాని వరవుడు నొడివెన్. 251

గీ. ఆకుఁబచ్చని జిలుఁగుచీనాంబరంబుఁ
జెలువ మెగఁబోయు భూషణావళియుఁ దాల్చి
తరుణి తలవాఁకిటను నిల్వ విరుతోడి
పూలమొక్కని యనుకొంద్రు మొదటఁ గాంచి. 252

క. దిగుచుంటి నేను నామే
నగోడ లెదురెక్కుచుండె నా మాడువు మె;
ట్లొగిఁ గలిసితి మిఱుకటమునఁ
మొగములు గ్రుచ్చికొనె నధరముల్ చిక్కువడెన్. 253

క. చెలి నను ధ్యాతను వెనుకొని
బలుగుబ్బలు గ్రుచ్చఁ గొంత వడి సైఁచియు ని
ట్టులు గాదనుచు నెదుర్కొనఁ
గిలకల నగెఁ గ్రిందఁబడియు గెలిచితి ననుచున్. 254

ఆ త్రొమ్మ విఱిచి కొమ్మ నెమ్మొగమ్మును వాంచి [illegible]
చనులవైపుఁ జూచుకొనుచు మెచ్చు
వాని బలుపుఁ బొలుపు, వాని మిటారంబు,
వాని గుండ్రతనము, వాని మిసిమి. 255

గీ. మగువ కోమలికముఁబట్టి చిగురుఁగొమ్మ;
అగును బో ! చింతకొమ్మ మైబిగువుఁబట్టి;
చిగురుఁగొమ్మైన చేవంట నెల్లి నిటనె;
పుణ్యలభ్యమ్మ గద ! యిట్టి ముద్దుగుమ్మ. 256

క. ఇంతలు గన్నులు గలిగియు
నింతి జనులపైకె నడచు; నెగదట్టైనొ నే
త్రాంతముల గాఢయౌవన
సంతమసము ? మూఁతపడెనొ ? చనుదో యెత్తై. 257

ఆ రామకోటి వ్రాయ రాము ననుగ్రహం
బనయమగు నటంచు నాలకించి
కామకోటి వ్రాయఁ గాము ననుగ్రహం
బేలకలుగ ? దంచు నింతి వ్రాయు. 258

క. "చనుమొనలు నల్లఁబాఱెను;
గనుంగవకు గానరాని కౌను బలిసె నే ?"
లన దూతి నగుచు జవ్వని
యనెఁ "గృప నీ విడిన విటమహౌషధసేవన్." 259

క. చెలి ! చీర నెంత దాఁగిన
లలితంబగు నీదు మేను లక్షింతున; యా

కులచాటున నునుదీవియ
వలెఁ గానంబడియుఁ గానఁబడక మధురమై. 260

క. తొరతొరగ నేగుచుంటినిఁ;
తొరతొరగా నెదురువచ్చెఁ దోయజముఖి ; యో
ర్తిఱుకగు సందడి; గాత్రము
లొరసెం; జేఁజిక్కెఁ జెఱగు; లూఁగితి మిటటుల్. 261

ఆ. ముద్దబంతిపువ్వు పోల్కిని బొద్దుగా
నొప్పు పొరుగుటింటి యొప్పులాఁడి
లేడిపిల్లవోలె గోడదాఁటును రేలఁ;
కఱచె నేమొ యోగకళను లెస్స. 262

ఆ. తరుణి హస్తనాడిఁ బరికించి తరుణుండు
"ఆడుచుండె మోహనాడి కడిఁది;
అలరుఁబోఁడి ! దీని కధరామృతంబె మం"
దన్న నిమ్మటంచు నడిగె నగుచు. 263

క. "కమలాఫలములు దె"మ్మని
ప్రమదామణి యడుగ ననెను బతి "నీదు సమీ
పమునఁ గలవుగద; కాంచితి
నిముసము క్రిందటనె ? చక్కనివవే మయ్యెఁ." 264

గీ. లేదె చిల్లరబేరంబు లేమ ! యొక్క
ముద్దుగ మోముఁ ద్రిప్పితి ముడిచి బొమలు;
గంపగుత్తగ నీయ సంకల్పమేని
నట్టులే యిమ్ము; నిస్సంశయముగఁ గొందు. 265

క. ననుఁ దాఁకిన నానీలిమ
కనకాంగీ! నీకు నంటఁగలదనుకొందే?
కనకంబు నీలరత్నం
బునఁ బొదిగిన యపుడె కడిఁది పొలుపు వహించున్. 266

క. కొఱుకును జక్కెరబొమ్మని;
శరీరమున కొత్తి వ్రేలు స్వాద మొనర్చున్;
దరుణుండు దనివి దీఱక
మరలఁ గొఱుకు; నాస్వదించు మరలన్ నగుచున్. 267

క. పులుగడిగిన ముత్తెమువలె
మెలంత యభ్యంగమాడి మెయితళతళతో
నిలువంగ సానపెట్టిన
యలరువిలుతు చికిలివాఁడియ మ్మనవచ్చున్. 268

క. పదినెలలు పెద్ద; వావికి
వదినె; విలాసవతి; నవయువకులకుఁ గనువిం;
దిదివఱకు మఱఁదినైనను
ముదితకు నే బావనైతి మొన్నటినుండిన్. 269

క. వెలిఁగింపని దీపము నా
నెలవునకును, వాడిపోవని ప్రసూనము పు
వ్వులతోఁటకు; మాయని రం
గుల బొమ్మయుఁ జిత్రశాలకు లతాంగి యగున్. 270

క. తళతళలాడు తనూలత;
కళకళలాడెడు మొగంబు; గలగల గజ్జెల్;

కిలకిల నవ్వులు; బాలా!
తలఁతు రతికి సవతివగుదు తప్పక యనుచున్. 271

గీ. తరుణి ముత్తైదువులఁగూడి యరుగుదెంచి
పేరఁటమునకు నట గోడ వ్రేలుచున్న
గేస్తు చిత్తర్వువంక వీక్షించు చయ్యొ
చిత్తరువు; భృంగకీట విచిత్రసరణి. 272

క. యువతికె రత్యానందం
బవుఁ బురుషునికన్న నధికమఁట; బ్రహ్మానం
దవిభూతి నొందఁగల దది
దివసంబులఁ; బురుషునకది దవీయమహో! 273

క. నలుగురు నగినన్ నగనీ;
యశకను; సిగ్గొందఁ జేసినట్టిపనికి నే
నలఁతియు; "స్త్రీరత్నం దు
ష్కులా"దపి యటన్న విబుధసూక్తి నడచితిన్. 274

క. "నలుపెక్కుచుండెఁ జూచుక
ములు; బలియుచునుండెఁ గౌను ముదితా!" యని నేఁ
బలుకఁగఁ, జెలి "మీ పురుషుల
చెలికారం బెట్టి నేఁగినేయ?"దని నగెన్. 275

గీ. అఱగిపోవునె? ముద్దియ నలరుఁబోఁడి!
అధరబింబంబుఁ జెక్కిళ్లు నంద నీవు;
తఱిగిపోవునె యంగచందంబులెల్లఁ?
గౌఁగిలీయక ముడుఁతువు గాత్రలతను. 276

ఆ. వెలదివేసమూని పేరంటమునకేగి
కలిసి రాచుకొనుచుఁ జెలులతోడఁ
బులకరింప నొడలు, మోముఁదమ్మి సెమర్పఁ
దొలఁగు విటుఁడు; వచ్చి కలియు మరల. 277

క. "నవకుసుమకోమలాంగివి
యువతీ! కర్కశము నీదు నురమొకటె" యనన్
నవలా నవ్వుచు "లావ
ణ్యవిలాసము గరుడుగట్టె నచ్చో" ననియెన్. 278

క. ఎదురైతిమి నడివీథినిఁ;
బదములవడి దగ్గ వ్రాల వదనములుఁ గడుం
గదియుదుము; కేల్కుదింతుము;
ఒదుగుదు; మఱికంటఁజూతు; మోఁదొరులఁ దమిన్. 279

క. విరిఁబోఁడి పణ్యపీథికి
నరుగంగా నహమహమిక నాపణికులు త
త్పరసాపాంగకమూల్యముఁ
బరిగ్రహించి యొసఁగుదురు వలసిన సరకుల్. 280

గీ. నీలరత్నంబుగలదు; కానీ ధరిత్రిఁ
గలదొకో? పీతరత్నంబు; కాంచనాంగి
సుందరీరత్నమగునె? తత్సూక్తిపాత్ర
మరయ నీ కోమలశ్యామలాంగిగాక. 281

క. అఱతలుపుచాటుగా నా
తరుణి నిలిచి వీథివైపు దరిసించుఁ దగన్

చిఱుమొగిలితునుకచాటున
నఱచందురుచిన్ని రేకయన శోభిలుచుఁ. 2

క. అనుదినముఁ దోఁటకరుగుచుఁ
గనరా కెవ్వరికి బాలిక మనోజ్ఞములై
కనవచ్చు దబ్బపండ్లను
జనుంగవను గొలుచుకొనుచు సంతసమొందుఁ. 28

క. తన కొమ్మ పూలగుత్తులు
దినదినమును బథికతతి చిదిమి చెఱుతురటం
చును గినిసి యఱచు గృహపతి;
కినిసినకొలఁదియును జిదిమి కేరింత్రతనిఁ. 28

క. తమిమై నంగకరన్యా
సములఁ దెలిపి ప్రియుఁడు ప్రియకు శయనీయాగా
రమున నుపదేశమిడె "ఓం
నమో భగవతే స్మరాయ" నా మంత్రంబుఁ. 285

క. తరుణీ! యొప్పులకుప్పవు;
కురూపి, గుణహీనుఁ, డకులగోత్రుఁడు పతి కె
వ్వరు నినుఁగట్టిరి? చీ! చీ
పురుకట్టకుఁ బట్టుదారమును గట్టినటుల్? 286

క. అఱుగందియఁ దలంచితె?
వరవర్ణిని! ముందు, వెనుకఁ, బార్శ్వముల ననున్
నిరతంబు రాచుకొంచునె
తిరుగుదు చనుమొనలు లెస్స దిగఁగ్రుచ్చు చిటుల్? 287

ఆ. "తరువు నాశ్రయింపఁ దమకించు లతకూన;
లతిక నట్లుగాదు క్షితిజ"మనుడుఁ
జెలువుఁ, దనియెఁ జెలువ "నిలువలేకయ తరుల్
గౌఁగలించి వేఁడుకొనును లతల." 288

గీ. నిలిచి మా ముంగిట నెలంతఁ బిలుచుచుండఁ
బలికి యా పేరి యెదురింటి వన్నెలాఁడి
తెఱచి తలుపానుకొని నిల్చె దృష్టిఁ ద్రిప్ప
కదుకుకొనిపోయెనో యేమొ ! కదలదయ్యె. 289

గీ. సుదతి యధరామృతము పేరి చొక్కుమందుఁ
ద్రావఁగాఁ జేసి తనదు గాత్రలత పేరి
మరులుఁదీఁగెను ద్రొక్కించె; నెఱుఁగనైతి
దాని పిమ్మట జరిగిన తంతదెల్ల. 290

క. తగఁ గులసతులు సువాసిను
లుగ మనఁగాఁ గోరుకొంద్రు లోకంబున మా
వగ భోగకాంతలైననె
నెగడుదురు సదా సువాసినీత్వముతోడన్. 291

క. ధరియించిన జిలుఁగుపయిం
దరుణీమణి సొబఁగు మేనితళకులగమి పె
ల్లుఱుకంగఁ జాలె కప్పిన
సురుచిరమగు పసిఁడిబొమ్మ శోభ వహించున్. 292

క. "దినమును నిశవలెఁ దనప
త్యనుస్మృతి సతికిల సనాతనాచారంబం

టని" ; "విపరీతమె యీ యుగ
మున శిష్టాచార" మంచు ముద్దియ నవ్వెన్. 293

క. అలకలు చెదరెను ; విరిసెను
దల జార్ముడి; మెయి చెమర్చెః స్తనయుగ మదరెన్;
మెలమెల్ల వ్రాలుచుంటివి
చెలి! నేలను విడిచి సాముచేయుట చాలున్. 294

ఆ. అదుపులేకొ ? యడ్డమాఁకలు లేకయో ?
కొమ్మ! నీదు తొమ్ము క్రొవ్వెనంటి ;
అతివ "మదన కదనమందు మార్కొను జెట్టి
కగుదు నీకు నుజ్జి" నంచు నవ్వె. 295

క. ఒకనాఁడు ఘూర్జరాంగన ;
యొక దినమునఁ బారసీక యువతీమణి ; వే
ఱొకనాఁడు యవనసుందరి ;
ఒకొక్క యవతారమునఁ బ్రియుం జెలి కలఁచున్. 296

ఆ. ధూర్తవిటుఁడువోలె దుడుకుగాడుపు రేఁగి
బట్టబయల నొడిసి పయఁట దుయ్య,
ముడిచి బొమలు దొట్రువడు చింతి యొయ్యార
మొలుక సరుదు ; మరల నొడియు ; సరుదు. 297

గీ. క్రొత్తచీర ధరించినఁ గ్రొత్తరయికఁ
దొడుగుకొన్నను సరిక్రొత్త తొడవులేని
గాజులేనియుఁ దాల్చినఁ గానిపించు
వచ్చి మాయింటి కిరుగింటిపడఁతి మొదట. 298

గీ. ముదిత సర్వాంగలావణ్యమును బ్రియుండు
గనఁగఁ దనివోక దానిచుట్టును జరించు ;
నాననోరోజములు గానరానిరీతి
స్వప్రదక్షిణ మొనరించు సతియు నగుచు. 299

క. నెఱి విరియు నెమిలిపురితో
సరియన జడయూడి కురులు జాఱఁ బొడవులై
పిఱుఁదులమీఁదికి, సుందరి
చరించును వసంతలక్ష్మిచాయను దోఁటన్. 300

ఆ. మలుపు దిరుగుదాఁక నిలిచి వాఁకిట నన్నుఁ
గాంచు రెప్పవాల్పకయ లతాంగి ;
తిరిగి తిరిగి వెనుకదెసఁ గాంచుచట ముందు
కడుగు సాఁగ కెట్లొ ! నడచిపోదు. 301

గీ. అతని కాకులలోన రావాకొకండె,
తొనలలోన మనోజ్ఞమౌ పనసతొలయె,
ఫలగణంబున నారంగఫలములె యగుఁ
బూలలో మేలితామర పూవె ప్రియము. 302

క. చెలి ముంగిట స్వాగతమిడి
యలరులవలిసురఁటి వీఁచి యడఁచి బడలికల్
తలకట్టు దువ్వి నా మో
ము లలిం దీఱిచి పెనంగి ముద్దాడు ననున్. 303

గీ. ప్రథమ కేశీరుచిం గొన్న పడుచులకవ
"క్రుంకునో ? క్రుంకఁదో ? యింకఁ బ్రొద్దు నేఁడు

అక్కటకట ! రాత్రి త్రియామయయ్యెఁ
గాద బహుయామ" యని యెదం గాసిఁబడియె. 304

క. "ననుఁ గనుదే" లని ప్రతివే
శిని కల్లగఁ గసరఁ, "దొలుతఁ జెలి ! నీవె ననుం
గనకున్న నేను నిన్నుం
గనుటెట్లెఱిఁగితి ?" వటన్నఁ గలకల నవ్వెన్. 305

క. తొలినాఁటిది సరిపడదో ?
మలినాఁటికిఁ; జాలదేమొ ? మఱునాఁటికి న
మ్మలినాఁటిది ; క్రొంగ్రొత్తవి
లలనామణి తొడుగు రవికలం బ్రతిదినమున్. 306

క. "కదురువలెనుంటి వింతకు
మొద ; లిప్పుడు గుదురవైతి ముదితా ! యేలం"
చు దయితుఁడన నవ్వెను జెలి
"త్వదధర సుధఁ ద్రావుచుంట బలిసితి" నంచున్. 307

క. తడికలఁ దూఱుచు, గోడకుఁ
బొడుచుచుఁ గన్నంబుఁ, ద్రోసిపోవుచ మిద్దెల్
పడఁతుక చూపులు ప్రియుపైఁ
బడుచుండును శబ్దవేధి బాణముల వలెన్. 308

క. గునుపేటికి ? కొమ్మా ! 'న
ల్లనిదాన' నటంచు ; రాత్రులఁ దమంబందున్
బెనుమసి హరినీలమువలెఁ
గనంబడక సంచరింపఁ గడు ననువుగదే ! 309

ఆ. మాతృభాషతోనె మగనితోఁ, బ్రియునితో
నాడు గూఢభాషతోడ నెదుట
“మాతృభాష పూత మగని కర్హం ; బన్య
భాష పెఱల” కనుచుఁ బడఁతి పలుకు. 310

గీ. జరిగెఁ దా నాసనమున నాకొఱకె యనుచు
నా రమణి దాసి ప్రక్కనే కూరుచుంటిఁ ;
“చిలుకయుం గోరువంకయు వలెను వీరు
పొలిచి” రని మమ్ముఁ గాంచి నల్వురుఁ బొగడిరి. 311

గీ. చక్కఁదనమునకుం దోడు చిక్కఁదనము
గలిగి సుందరి కందర్ప కదనములను
నలిగియును లెస్సగనరాదు నలిగినట్లు
పట్టుకుచ్చన ; నుత్సాహవతిగ మెఱయు. 312

క. చిలుఁగంటఁగ మైదీఁగకుఁ
గొలఁకున నీరాడి ముద్దుగుమ్మ రసముఁ బె
ల్లొలికించు స్వ సర్వాంగం
బులు సూపుచు బోయె నాఁచి పురుషుల యెడఁదల్. 313

క. “తల దువ్వితి విపుడే కద !
కలికీ ! జడ సెరిగె ; నలిగె గండంబులు ; గం
టులువడె వాతెఱ ; కా దీ
చిలుంగు నీ” ; దనుసఖిఁ జెలి “చిలిపి” వని నగెఁ. 314

గీ. కలికి రతనంబు రైకఁ జంకలకుఁ దొడిగి
ననుఁ గనుచు గుబ్బలమరించుకొనుచు నిలిచె

నెదుగుచుం, బెద్ద నిక్కుచు, నొదుగక యవి
బెడియుచల్లరిపెట్టి నవ్వించె మమ్ము. 315

క. అడిగినది యొక్క ముద్దే;
పడంతి వేముద్దులిచ్చె; వాతెఱయును, జ
గ్గడవల జంటను, దన పెం
దొడలను, నొకటేమి ? నిలువుదోఁపే యిచ్చెన్. 316

క. తనుఁగాంచ వాంచియును దల
గనె ననుఁ గ్రేగంట; దాఁగి కలికి యెడందన్
ననవిల్తుఁడు నన్నేసిన
సునిశితవిషశరము కరణి గ్రుక్కించెఁ గడున్. 317

క. తనపతి యెవతిని వలచెనొ
కొని తా నా యువతిరూపు కోమలి చదురై
తనియించి తనిసి స్వాహా
వనితామణి కరణిఁ; దుదికిఁ బకపక నవ్వెన్. 318

చ. ఒకపరి తొంగితొంగి, మరియొక్కపు
డాస్యము సాఁచి, యొక్క మా
ర్మొకము మలంచి వెన్నెసకుఁ;
బొల్పుగ వేఱొక త్రేపఁ జూపుఁ బ్ర
క్కకు నిగుడించి, నన్నుఁ దమిఁ గాంచు
వధూటి మహోత్సవంబునన్
బకపకలాడు చాటలను బాటల
మున్గియుఁ బేరఁటాండ్రతోన్. 319

క. "రమణీ! న స్త్రీ స్వాతం
త్ర్య మర్హతి"యటన్న సూక్తిఁ దలఁపవె? నా త
ల్పము నాక్రమించుకొం" టన
"రమణా! గది స్త్రీ స్వతంత్ర రాష్ట్ర"మని నగెన్. 320

గీ. "చౌర్యరతులకుఁ గావలెఁ జాటుమాటు
లాలుమగలకు నేల రహఃప్రదేశ?"
మంచు యౌవనమదమత్తులైన పడుచు
లరుగొ! ముంగిట నిలిచి ముద్దాడుకొంద్రు. 321

క. చిఱునవ్వులపువ్వులతో,
నుఱవగు చందోయి పేరి యురుఫలములతోఁ
గరతలములచిగురులతోఁ,
దరుణీ! కొమ్మనుట కీవు తగుదువుగాదే? 322

క. ఎందఱలో నున్నను నను
సుందరి కనుబొమ్మ లెగచుచుం గను; నవ్వుల్
చిందించును గెమ్మోవిని;
సందిలి యగపఱచు నెదొ మిషన్ ననుఁ గనుచున్ 323

గీ. "అక్కా! బిడ్డలు పుట్టుదు రాండ్ర కెట్టు?"
లని యడుగఁ జిన్నిచెల్లె లా యతివ నవ్వె;
"నెప్పుడడిగిన నవ్వుదు విప్పి చెప్ప
కడుగుదును బావనే" యంచు వెడలెఁ బడుచు. 324

క. ధరణిం జౌర్య రతంబులు
సురాలయమునన్ ఘటింపఁ జొప్పడ దఘమం

చరసిరో ః విటీవిటుల్ గుడిఁ
బరిరంభ మొనర్చికొనియ పందిరి యొకపై. 325

క. పయనంబు గాఁదలంపఁగఁ
బ్రియురాల్, పాదుకల, నుత్తరీయము, నా క
ఱ్ఱయు దాఁచి మున్నె తా నే
మియు నెఱుఁగనిగతిని వెదకు మిన్నక నాతోన్. 326

క. పొరుగింటి దబ్బకొమ్మకు
నరుదుగఁ గాచెను ఫలద్వయం; బది యుఱపై
సరవిం బసిండి జిగులను
విరఁజిమ్ముచు వంగి నాదు పెరడున నొరిగెన్. 327

క. తన నాథుని నామంబే
తన సరసుని నామమగుటఁ దరుణి లిఖించుం
దన యఱచేతను, బారా
యణంబుఁ గావించు 'సాధ్వి' యని యెల్ల రనన్. 328

క. వలరాజను శాకునికుఁడు
చెలువల మానికము పేరి జిగురుంగండెం
దెలియనిగతి నంటించుచు
వలకాండ్రనుపులుఁగుగమినిఁ బట్టుచునుండెన్. 329

ఆ. నడచు నన్నుఁ గాంచి నడచును దనయింటఁ;
గూరుచుండఁ దానుఁ గూరుచుండు;
లేవ నేను లేచు లీలమై; నెదిరింటి
కలికి నాదు నీడ కాఁదలంచు. 330

క. ఇలు వెడలు నాకుఁ బొరుగిల్
వెలంది నా వెలఁదివోలె వీడ్కోలొసఁగున్;
నిలువఁబడి ద్వారమున న
వ్వులతో స్వాగత మొసంగుఁబో! వచ్చునెడన్. 331

గీ. కచ, కుచ, నితంబ బింబముల్ ఘనతరంబు
లొక్కటిని మించి వేఱొక్క టువిదమిన్న!
అయ్యొ నాపైకి నెగిరితి వతిసుఖవుగ
నించువిల్కాని కీల్బొమ్మ వేమొ? తరుణి! 332

క. పుడమిని మల్లెలు పఱచెడి
వడువున, వెలిదమ్మి పూలపందిరి రచియిం
చెడుపగిది నింటిముంగిటఁ;
బడంతి వీక్షించుఁ బ్రియుఁడు వచ్చెడు త్రోవన్. 333

క. ఏవాడ దిరుగుచుండిన
నావాడనె కానిపించు నంగన యెదురై;
యేవారియింటి కేగినఁ
దావచ్చును వారియింటి దరి కేదో మిషన్. 334

గీ. పెఱవెలందుక లాపాదశిరము చిరము
అందచందంబులను దిద్దుకొంద్రుగాక
రతనపుంబొమ్మ! నీవేల? ప్రకృతిచేతఁ
జక్కనగు వస్తువునకు సంస్కారమేల? 335

ఆ. కొమ్మకేలు వట్టఁ గెమ్మోవి కంపించెఁ;
బీనకుచయుగంబు పెద్ద యదరెఁ;

దడఁబడం దొడంగె నడుగు లిట్టటుఁ; దీవఁ
గదప నెల్ల పూవుఁబోదయుఁ గదలు. 336

క. పిలువక యున్నం దన్నుం
బిలిచితివే? యనుచు వచ్చి ప్రియురాల్ తన క
న్నుల నార్చు; నుఱక పయ్యెద
విలాసముగఁ దూల్చు; నవ్వువిరులఁ రువ్వఁ. 337

ఆ. ఒక్క నెనరుచూపు, నొక్క మోహపు రాఁపు,
నొక్క ముద్దుమాట, నొక్కపాట,
మచ్చుఁ జూపినావు మగువమిన్నా! మొన్న
ఇత్తువేని వాని గుత్తఁగొందు. 338

ఆ. "ఇట్లు ముద్దులాడు; నిట్లు గుబ్బలువట్టు;
నిట్లు గౌఁగిలించు; నిట్టులాను
మోవి; నింక నిట్లు పొనరించుఁ బతి;" యని
యక్క గఱపి చెల్లె నంపె గదికి. 339

క. పిలువని పేరంటంబులు
సలుపును మా సదనమం ; దొసంగును నాకుఁ
బిలువనివిందులు వాకిట
నిలఁబడి యెదిరింటి జవ్వని విలాసముతో 340

క. "ప్రియుతోఁ గ్రీడించెద నీ
క్రియ నీ క్రియ" నంచు నెంచుఁ ; బ్రియుఁ డెదుటికి రాఁ
గ్రియలెల్ల మఱచిపోవును
దయితాంగములందు లీనతం గొమ్మ గొనుఁ. 341

క. తరుణి ! కిరాతివె ? కాకి
క్కరణిని విషదిగ్ధబాణకాండంబును నన్
గుఱిసేసి వ్రేయుదే ? యిది
వఱకచ్చరవని ప్రమాదపడి తఱిసితిఁజూ ! 342

క. పతి యింటనుండ సంకే
తితుఁడై యరుదెంచు నుపపతిం గని నవలా
పతితో "సగోత్రుఁ డట నీ
కితండు రమ్మంటిఁ గలియ నీనాఁ" డనియెన్. 343

క. నన్ను సంతసాని యనుకొం
టె ? నీవలెను; నేను గర్మనిష్ఠులయింటన్
జనియించితిఁ; బతి వీడఁగ
ననుపులఁ దగిలితిని; దొసఁగు నాదే ? యరయన్. 344

గీ. మెఱుఁగులఁ గరంగి పోసిన కరువనంగఁ
గాముకుల వ్రేయు కందర్ప కళయనంగ
నమృతపుంజున్నుఁ, జెఱకుపండనఁగఁ దనరు
మోహనంబయి మధురమై ముద్దులాఁడి. 345

గీ. ఎన్నివంకలు దిరిగిననేమి ? యేఱు
చిట్టచివరికి సంద్రంబుఁ జేరఁగాదె !
యెన్ని తిరుగుళ్లు దిరిగిన నిల్లుసొచ్చె
నింతి పదివేలనుచు భర్త సంతసించె. 346

ఆ. అతివ నడచు లాస్యమాడు చందంబునఁ ;
బలుకులాడుఁ బాటపాడు పగిది ;

నవ్వుచుండుఁ దనకుఁ బువ్వుఁబోఁడ్లెల్లరు
దీసికట్టు టన్న తెలుఁగు దోఁప.

క. సరసున నీరాడుచు నొక
తరుణీమణి యుండ నలఁతిదౌల జలములం
జొరఁబడి మునింగి మకరము
సరణిం దత్ప్రియుఁడు దాని చరణముఁ బట్టెన్.

క. అడుగులకు మడుగులొత్తును,
గడింది పెద్దలకు ; మగనికడ నీడవలెం
బడఁతుక యెడయదు ; మిక్కిలి
యడఁకువ ధూర్తస్వభావమనుట నిజముగాఁ.

క. అటునిటుఁ జూతువదేటికె ?
చటులాక్షీ ! యుంటిఁ బాదసన్నిధిని ; మదో
ద్భటములగు నీదు గుబ్బ ల
కట ! మొగమును మూసివేసి కననీయవొకో !

క. మాయూ రా యూరికి నెం
తో యాయూ ర్మాకు నంతె దూరముగద ; కా
నీ యయ్యె దూరతరముగ
మాయూ ర్ప్రేయసినిఁ జూచి మఱలెడు నాకుఁ.

క. తరుణీ ! ననుఁ బట్టఁగ ముం
గురులను నురులొడ్డి యిచటఁ గూర్చుంటివె ? యీ
వఱకే తావకశితదృ
క్శరతతికి శరవ్యమై సగముఁజచ్చితిఁ జూ ! 352

ఆ. "చందమామ రావె! జాబిల్లి రావె! గో
ఢెక్కి రావె!" యంచు నిగురుఁబోఁడి
హస్తసంజ్ఞ శిశువు నాడించుమిషఁ బిల్చె
ననువుగాని వీథి నడచువాని. 353

గీ. "అందచందంబులను లెస్స చంద" మనుచు
ముదిమగండన జవ్వని చదురులాఁడి
యనియె "అభ్యర్థితం పూర్వ" మగుట నాస
మానమున నంద మనుమాటె యాద్యమయ్యె." 354

గీ. తాత యనుకొంటి మగఁడఁట తరుణి; కతని
వెంట నంటుచుఁ దాఁ దన్ను వెంటనంటు
తరుణు ముద్దాడు వెనుకకుఁ దిరిగి; సంధ్య
జరఠరవి రోసి శశివైపు దిరిగినట్లు. 355

క. "మన కొమ్మపైని వ్రాలెను;
గనుమేదో? క్రొత్తచిలుక; కలికీ! యిదిగో!"
నని చెలి మఱొక్క చెలితో
నన దూఱిరి పడుచు లులికి యలరుంబొదలోన్. 356

క. కనుఁగొంటినిఁ గ్రాల్గంటిని
ధనుశ్శత ప్రమితమైన దవ్వుల లోహం
బు నయస్కాంతమణి తెఱం
గున నాకర్షింప నదుకుకొంటిమి బయలన్. 357

క. హరిణీ! నా చెలికన్నుల
హొరంగు హరియింప వచ్చియుంటివె? కాకి

త్తఱి నిట్లు బెదరుచూపులఁ
బరికించుచు నందకేల పరుగిడవలయుఁన్ ? 358

క. ప్రతివేశిని స్వసుతుఁడు మ
త్ప్రతిబింబం బనుచు నవ్వ వార్వీ, ర్వతితోఁ
"ప్రతివేళరూపసంతతి
శతాయువని వింటి సంతసంపడు" మనియెన్. 359

క. తనపేరు లక్ష్మి యగుటం
దనపతిసఖుఁడైన యట్టి నారాయణుఁడే
తనపతి కానర్హుండని
మనమునఁ దలపోసికొనును మగువ సతతమున్. 360

క. నును బోఁకబోదియను బెనఁ
గొనిన లతికవోలె నదికి కోమలి కలియన్
నను నా బ్రహ్మానందం
బు నెంతు మత్సుఖశతాంశముగ వేయేలా! 361

గీ. రేఁపటి ప్రయాణమును మార్చు మాఁపటికిని;
మాఁపటిది రేఁపటికి; నిట్లు రేఁపుమాఁపు
లరుగునే కాని జరుగ దొక్కఁడు గదేమొ?
యత్తవారింట నున్న క్రొత్తల్లునికిని. 362

క. ఇలువెడలు నాకు విఘ్నం
బులు నేయుచు; నొట్టుఁబెట్టుఁ బోవలదని; పో
వలసిన గడువడుగును; నా
వెలంది తనచేతఁ జేయి వేయించుకొనున్. 363

క. తరుణీ! చరింపఁజాలవు
గురుభారము లయిన గబ్బిగుబ్బలతోఁ, బెళ
పిఱుఁదులతో; నాఁగుము! చం
ద్రరేఖ శివుఁ డట్లు నిన్ను దలపైఁ దాల్తుణ్. 364

క. "ఏ రైకం దొడుగుదు? నే
చీరం గై సేతు? నెట్టి శృంగారము నే
నీరేయిఁ జేతు?" నని సర
సీరుహముఖి చూపి యడుగుఁ జెలువుని నగుచుణ్. 365

క. రతనంబు సానఁబెట్టఁగ
ద్యుతులను విరఁజిమ్ముఁ గాదె? యువతీరత్నం
బ! తగం దావక గాత్ర
ద్యుతులను మిఱుమిట్లు గొల్పెదునె రాపిళ్ళణ్? 366

క. చలియింపఁగ నునుదీవియ
దలిరాకున డాఁగినట్టి స్తబకములవలెణ్
జిలుఁగుంబయంట దొలఁగఁగఁ
జెలి బలిసినచనులు విందు సేసెఁ గనులకుణ్. 367

క. పిలుచు ననుఁ జాఁచి చేతులు,
వెలంది యెత్తుకొన శిశువుఁ బిలిచినగతి; మో
వులు ముడిచి వట్టి ముద్దులు,
మొలకనవులు వెలయ నాదుమ్రోలకు వచ్చుణ్. 368

క. చిత్తరుబొమ్మనఁగ ననా
యత్తమతిం దన సమస్త మర్పించినటుల్

బత్తరి తెగబడి వాఁకిటి
మొత్త నిలిచి గురులఁ ద్రోసిపుచ్చి విటుఁ గనెన్. 369

క. ననఁబోఁడిదైన చిత్తరు
వును గూడం దీసికొనియ పోవుదు నెటకేఁ
జనినను ; క్షణక్షణంబును
గనుదును ; ముద్దాడుకొందుఁ ; గౌఁగిలిగొందున్. 370

ఆ. ప్రొయ్యి నూఁదుమనును ; మ్రొక్కను డెంకాయ
నమ్మవారి ; కడుగ నరుగుఁ బ్రశ్న ;
శకున మడుగుఁగాకి శరదిందుబింబాస్య
హృదయనాథు రాక కుదిలఁగొనుచు. 371

గీ. సంధికయి యెంత జతనంబు సలుపుచున్నఁ
బ్లుత మొనర్చుచుఁ బోవుఁ బూఁబోఁడి ; కాని
మతి విడకపట్టు కతిపయప్లుతములందు
సంధి సాధించితిని సఖా! చతురిమమున. 372

క. తన కొంగును దాఁకించెను;
దన పదమునఁ దరుణి నా పదంబును ద్రొక్కెన్ ;
దన కేలివ్రేళ్ళ నా వ్రే
ళ్ళను నలిమెను యాత్రికాకులంబగు రథ్యన్. 373

క. వెలిఁగింపవచ్చు దీపముఁ
జెలువా! నీ గాత్రమునకు ; క్షితి మెఱుపునకున్
లలిఁగట్టిన యంటనఁ దగి
చెలువంబును హొయలుఁ బెద్ద చిమ్మదు సతమున్

ఆ. యువతి నమలి నోట నుంచు కమ్మనితమ్మ,
కొమ్మ గ్రోలినట్టి గోరసంబు,
పడతి సగము దిన్న ఫలము, నా కయ్యెను
రుచ్యతరమె కాదు రుచ్యతమము. 375

గీ. పూన్కిఁ దిథివారనక్షత్రములను జూచి
తమరు మడిగట్టి దర్భాసనమును బఱచి
యందు శ్రోత్రియ దంపతు లాచమించి
యనఘసుతయజ్ఞసంకల్ప మాచరింత్రు. 376

క. తను లెస్సమరిగి యుండఁగఁ
దన యువతికి మరులుమందుఁ ద్రావింపఁగ నా
ననఁబోఁడి వీడి గేహముఁ
బొనరిచికొనె వేశవాటమునె వాసముగాఁ. 377

గీ. ఎదురెదురు నిల్చి తూఁగుటుయ్యేలయందుఁ
గూర్చొనుచు లేచు చూఁపులూఁగుచును బెద్ద
యతుకుకొనిపోనొడళ్ళు దంపతులు సందు
సడిగ ముద్దాడుకొం; ద్రానుచంద్రు మోవి. 378

క. చదువును ముదమునఁ ; గ్రమ్మఱఁ
జదువును బ్రియు మదనలేఖఁ జాటుగఁ జెలి ; చూ
చెదరేమొ ? వచ్చు చెలులని
పదిలపఱచు రయికఁ ; దీయువారలు చనగఁ. 379

క. నడచినఁ, గూర్చుండిన, నిలఁ
బడినను, బనిసేయుచున్నఁ, బ్రమదారత్నం

బెడరించు నొయారంబులు
పడంతులకు నెల నొజ్జబంతులుగా వే ? 380

క. అతివ ! "పతివ్రత నగు ననుఁ
బతితం గావించి"తంటి ; ప్రథమంబునఁ జే
సితివేల యేకపత్నీ
వ్రతస్థుఁ గొంగునను గొట్టి పతితునిఁగ నను౯ ? 381

ఆ. పగటిపూటఁ దరుణి; యగు రేయిఁ దరుణుండు
వ్యక్తి యొకటి గలదు ప్రక్కయింట;
నెట్టి తపమొనర్చి యేవేల్పులం గొల్చి
యిట్టివరము లందె నెఱుఁగరాదు. 382

క. ఎఱకలను గట్టి నామం
దిరంబుపై నుండి వ్రాలి నెలఁతుక మిద్దెం
గరుటామంతుఁడు ఫణిక
న్యరహిం గొంపోవఁగా మనంబునఁ దలఁతు౯. 383

క. పలువేసంబులు వేయును;
బలుతెఱఁగుల బాసలాడు; బహుకంఠములం
బలుకాడు ; నరయ నది మా
యలాఁడి; కడు గ్రంథసాంగురాలు చెలువుఁడా ! 384

క. జనకుండు పండుగకుఁ దనుఁ
గొనిపోఁ జనుదేరఁ, బెనఁచికొని యువతి ప్రియు౯
అను; "నీదు పొత్తుకంటెను
ఘనతరమగు పండు గొండు గలదే నాకు౯ ?" 385

క. కనుసన్న నేసె నొక్కఁడు;
వెనుకటి జడలాగె నొకఁడు; విసరెను విరిదం
డను మీదఁ నొకఁడు నే నబ
లనంచు; నెదురాడ వెలికిలంబడిరి త్రుటిన్. 386



క. మతిమాలియుంట నడచితిఁ;
బ్రతివేశవధూగృహాంతరం; బటఁగొని జా
గృతి నడిగితిఁ దత్పతి "దే
వతార్చనకుఁ బూలుగోయ వచ్చితి" ననుచున్ 387

*గీ. వదినె ! దూష్యంబు గాదంట భ్రాతృయువతి
చెట్టపట్టుట యోఢ్రదేశీయులందు ;
ఇద్ది పాపిష్ఠదేశ; మిందేల యుండఁ;
బోద మా పుణ్యభూమికి మూటగట్టు ! 388

ఆ. కొమ్మతోడఁ దోఁటకుం జని తరుకొమ్మ
జుంటితేనెఁ గాంచి నంటుకాఁడు
రుచివిభేదముల నిరూపింతు నీకని
కొమ్మ జంట తేనెఁ గ్రోలఁదొడఁగె. 389

గీ. "స్వాగతము ! స్వాగత" మటంచు సంజవేళ
నరుగుపయిఁజేరి చిలుకకుఁ గఱపుఁ జెలువ
కమ్మవలపు గుబాళించు తమ్మలమ్ము
నమలుచు వయాళిఁ జనుచుండ ననుపుగాండ్రు. 390

* న దోషో మగధో మధ్యే । బాన్నయోనౌ కళింగకే
ఓఢ్రే భ్రాతృవధూ భోగే । గౌడే మత్స్యస్య భోజనే
దుహితు ర్మాతులస్యాపి । వివాహే ద్రావిడే తథా
యస్మిన్ దేశే యదాచారః । పారంపర్యో విధీయతే.

క. వదనము సుధాంశుబింబము ;
త్వదీయ మధరోష్ఠ మమృతపాత్రము ; పలుకుల్
మృదుమధురసుధాధారలు
సుదతీ ! అమృతాంబుధిప్రసూత వరయఁగన్.

గీ. అల ఘనాపాఠిగారి కోడలును, శ్రౌతి
గారి కూఁతురు ; చయనులవారి సాధ్వి
యిట్టిరికి నాటపట్టు గాఁబట్టి వేళ
వాట మది యజ్ఞవాటమై పరగె నేఁడు.

క. కలికి యొకతె మేనల్లుని
తలదువ్వుచు వెనుక నిలిచి తన చనుమొనలన్
గిలిగింతగొలిపి నవ్వును
"బులకించితి; పిన్నగావు ప్రోడ"వటంచున్.

క. ప్రతివేశినిపతి తన కుల
సతికిన్ సావిత్రి, సీత సరిగా రనుచున్
క్షితిని "నభూతో న భవి
ష్యతి యట్టిది" యన "నవును యథార్థమ" యంటిన్.

క. అమృతపువర్తివి నా నే
త్రములకుఁ బ్రత్యక్షమందు ; రమణీ ! విషది
గ్ధము, శాతము, నగు స్మరబా
ణమవు పరోక్షంబునందు నాదు నెడఁదకున్.

క. క్రిందంబడి యొక త్రుటిలోఁ
గందుకమనఁ బైకినెగురుఁ గలికి ; ప్రియుఁడొగిం

గ్రిందంద్రోయ నెగురు ; నీ
చందంబులె కాముకులకు సాముల్ చదువుల్. 396

క. తన శిశువునుగని మీ నా
యన యేఁడని యెవ్వరేని నడుగుడుఁ బతిఁ జూ
పిన మోము ముడుఁచు ; విప్పును
మనమున మెచ్చుచును మేనమఱఁదినిఁ జూపన్. 397

క. తన ప్రియతము పేరడిగిన
వనితకు జవరాలు నొడివి స్వమనోహరు పే
రినిఁ గళవళించెఁ ; దత్సఖి
యనె "నీ పతి తొంటినామ మదియే చెలియా ?" 398

క. "కలికీ ! సుధాంశువై పతి
యలరం గుముదినివిగాక యబ్జినివై క
న్నులు మూయుదేల ?" యన ననెఁ
"జెలి ! గిట్టదు వెట్టితీఁపి చేఁదనిపించున్". 399

క. అధరముఁ గదపక నేత్రా
వధానముం జేయుచున్న పగిదిని మదన
వ్యధితులయి వాకిటం దమ
కథలను వచియించుకొంద్రు కలికియుఁ బ్రియుఁడున్. 400

క. మన యిర్వురి వదనాబ్జము
ల, నోష్ఠనవపల్లవంబులను, నాసాకాం
చనములను, గ్రుచ్చి చెండుగ
ననవిల్తుని కప్పనం బొనర్తమె ? కలికీ ! 401

క. పరశాస్త్రంబులఁ జేయఁగఁ,
బరిశోధనలెల్ల వారు పడుచులోకయెడన్
స్మరశాస్త్రంబునఁ జేసిరి
పరిశోధన ; లొసగె స్మరుఁడు పండితబిరుదుల్. 402

క. స్తనగిరి శిఖరంబులపై
ని నధిష్ఠించి సఖి ! నియమ నిష్ఠలభవదా
ననచంద్రామృతమానుచు
మునిఁగి తపోరతినిఁ గాలమును బుత్తు నిఁకన్. 403

క. పొరుగింటి బ్రహ్మచారికిఁ
దరుణీమణి షష్ఠినాఁడు దానమొసఁగెఁ ద
త్పరమతిఁ దన చన్నుల క
స్తురి వలపులఁ జిమ్మునొల్లెదుప్పటముఁ దమిన్. 404

క. జడ నల్లుచు నల్లుచు, మై
తొడవులు తొడుగుచుఁ దొడుగుచుఁ, దోరంబుగ బొ
ట్టిడికొం చిడికొంచునె వా
కడ కరుదెంచుఁ జెలి యొసఁగఁగా వెస ముద్దుల్. 405

క. తరుణీ ! ము త్తైసరు లిగో !
సరిపడునో ? లేదొ ? నీదు చక్కని మెడకుం
బరికింతు" నంచు నెదపై
సరుదుచు నందుసుడిఁ బ్రియుఁడు చనుదోయొడిసెన్. 406

క. పనసతొన మలఁచఁబడియెనొ ?
వనితామణిరో ! రసాలఫల మవతారం

బును గొనెనొ ? ముఖేందు సుధల్
ఘనీభవించెనొ ? త్వదీయ కఠ్రమాధరమై. 407

క. ననఁబోఁడి ! జలక్రీడల
"మునుంగుదునొ గురునితంబముల భారముచే"
నని చొరక చూచుచుంటివె ?
స్తనకుంభయుగంబుగల దెదందేలెదులే ! 408

క. పరివేష్టింపఁగ సకియలు
దరుణీమణియును మయూరతండంబును సుం
దరముగ లాస్యం బాడును;
గురుశిష్యవిభేద మెఱుఁగుకొనరా దలఁతిఁ. 409

క. గలగలమువ్వలతో, నం
దెలతో, నవయౌవనంపుఁ దిమ్మరుతో, గ
జ్జెలగుజ్జుము చందంబునఁ
జెలువ కదను ద్రొక్కుకొనుచుఁ జెలువునిఁ దఱిసెఁ 410

క. చదువుము కొక్కోకంబును ;
జదువుము వాత్స్యాయనంబు ; చదువుము యువతీ !
మదనపురాణములను ; బెఱ
చదువులపనియేమి మనకు జవ్వనుల కిలఁ. 411

గీ. బాల ! శ్రీరస్తు నీ ముఖాబ్జాతమునకు;
యౌవనప్రాయమునకు దీర్ఘాయురస్తు;
పీనవక్షోజములకుఁ బ్రవృద్ధిరస్తు;
అంగముల కెల్ల మదనోత్సవాప్తిరస్తు; 412

ఆ. నిన్నుఁగాంచఁ గనులు, నీ మాటవినఁ జెవుల్,
నీ సుగంధమాన నాసికయును,
త్వదధరామృతంబుఁ ద్రావ జిహ్వాయు, నిన్నుఁ
గౌఁగిలింప నొడలు కలికి! కోరు. 413

క. "నెలనెలకు మూఁడు దివసం
బు లిటుల్ పండెదవు మూల ముసుఁగిడి; నీకుం
బలపడు రోగము; నీ ప్రియుఁ
జెలి! మందడుగు"మని సఖి వచించెను నగుచున్. 414

గీ. ఆడుచుం బాచికలు ఫలాహారపాత్ర
గతఫలము లొడ్డుకొనిరి దంపతులు పణము;
గెలిచెఁ గదళీఫలంబును వలపులాఁడి;
పనసతొనను జయించెను వలపులాఁడు; 415

క. సతి "పర్యాయపదంబునఁ
బతిపే ర్వచియింతు"నంచుఁ బలికి చెలుల వం
చితలను జేసెను ; దనయుప
పతినామముఁ దెలిపి యెంత పండితురాలో? 416

ఆ. తన కటాక్షజాలమును నా ప్రియుండు నా
పైనిఁ బఱపుచుండఁ బడఁతి! తలఁతు
వానితోనదూఱి వలువలో నాతఁ డా
పాదశిరము నన్నుఁ బ్రాఁకునట్లు. 417

గీ. అమ్మవారికి నర్పింప నలరుఁబోఁడి
యలరుదండను గ్రుచ్చి, సాయంతనమునఁ

జనుచు గుడికి, వచ్చుచు విదేశముననుండి
యెదురయిన నాథు మెడవేసి యదికికొనియె. 418

క. చని పేరంటమునకుఁ గనుఁ
గొని పెండిలికొడుకు నచటఁ, గోమలి తెగి వా
నినె కనుచు, విచారించెను
దన కాతనితోడివావిఁ దద్బంధువులన్. 419

క. తొలఁగించి తొంటి యిలువే
ల్పుల విగ్రహములను బత్తిఁ బువ్వులు రతిఁ
నిలిపి యటఁ గ్రొత్తకోడలు
సలుపఁ దొడఁగెఁ బూజఁ బ్రాహ్ణసాయాహ్నములన్. 420

క. ఒక సందున నేనేగితి;
నొకసందున యువతివచ్చె నొప్పులకుప్పై ;
యొకపైతిమి మే మిర్వుర
మొకచో సురఝురము యమునయును గలిసినటుల్. 421

గీ. ఆకుఁబచ్చని చీనిచీనాంబరంబుఁ
దాల్చెఁ జెలి ; పైనిఁ జెయివేసెఁ దత్ప్రియుండు ;
వార్వమగు చిల్కయును దాన స్వారిసేయఁ
జేతఁ దట్టెడు వలరాజు భాతిఁదగిరి. 422

క. కనుచుంటినిఁ బ్రతివేశిని ;
వెనుకనిలిచి నన్ను నాదు వెలఁదుక కనుఁగొం
ట నెఱింగి యాపె వినున
ట్లనుకొంటిని నాదుప్రియయె యది యనుకొంటిన్. 423

క. తరుణీ! లేఁ దెవఁడును నీ
పురఃస్థలిం గన్నులార్తువు ; చనుంగవఁ గ
న్నుఅతువు పయ్యెదఁ దూల్చుచుఁ
గొఱుకుకొనుదు మోవి ; నవ్వుకొనుదువు లోలోన్. 424

క. తమకేటికి మా సంబం
ధము ? సహనము లేకకాక ; తమకిట్టి యదృ
ష్టము లేమికేడ్చు చతివలు
మము దూఱిన ఖావినిం దమకు శూన్యమగున్. 425

ఆ. అగరువత్తి పగిది వగలాఁడి గుమగుమ
లాడుకొనుచు హృద్యయై చెలంగు ;
మన్మథాగ్నితప్తమదియైన తఱి నూర్పు
పొగలు నిగుడ వలపు మిగులఁ జిలుకు. 426

క. తరుణుండు దర్శనీయుఁడు
స్మరుండె పతి ; యయ్యు మరగె మగువ భుజంగుం ;
బొరుగింటి పుల్లకూరయు
సురుచిగదా ! వామఁ డంద్రుసూ ! కాముఁడనన్. 427

చ. కలువలఁ జూపుమన్న లలి
కన్నులఁ జూపెదు; చూపు మల్లెపు
వ్వులనన మోవిపైఁ జిఱునవుల్
విరియింతువు ; చూపు పూల చెం
డులననఁ జిల్గుఁబయ్యెదఁ గడుంగడుఁ
దూల్తువు బాలవయ్యుఁ బ్రౌ

ఢలఁ దలఁదన్నుచుంటివి మిటారి
తనంబునఁ బుష్పమాలినీ! 428

ఆ. "అక్క తొడుగునట్టి యాయాయి రైకలఁ
బ్రతి దినంబుఁ దాల్తు బాలవయ్యు;
అక్క యీడు వచ్చునప్పటి కెట్టివి
తొడిగె?" దంచు నవ్వె నడిగి వదినె. 429

క. ననుఁగాంచువఱకె బొమముడి;
తను నే నవ్వుచును డాయుదాఁకనె బాసల్
ననఁబోఁడికిఁ; జంద్రోదయ
మునఁ దమమ ట్లలుక విచ్చిపోవును ద్రుటిలోన్. 430

క. తరుణీ! చందోయిపయిన్
విరచింతురు మకరికలను; విరిసరములఁ దా
ల్తురు; మరి మోదుగుమొగ్గల
నెఱుంగ మంటించుకొంట నెటఁ గఱచితివో? 431

క. ఇరుగింటిది వెలివడఁ గని
పొరుగింటిది నాఁడు పబ్బముగఁ దలపోసెన్
దలగడిగె; నిల్లు నొళ్ళును
నలంకరించుకొని గుమ్మమందు నిలఁబడెన్. 432

క. తన గాత్రము నా గాత్రం
బున లీనమొనర్పఁ దలఁచిపో! ప్రతివేళాం
గన నా పాడెడు వర్ణముఁ
గొని సగమునఁ బాడునట్లె కొనఁదాఁకఁ దమిన్. 433

ఆ. మగువ పూలవలపు లెగఁజిమ్మ మైదీఁగ
సంచరించుచుండి సందులందు
వ్రాలఁ దరుణనయనబంభరకోటి యా
పాదశిరముఁ ద్రోలుఁ బైఁట విసరి. 434

క. వరలుదువు నాకుఁ బశ్చా
త్పుర ఊర్ధ్వాధః ప్రదేశముల నిత్యం బా
పరమాత్మగతిఁ ; ద్వదైక్యము
వరించి నా జీవుఁడెపుడుఁ బ్రయతించు సఖీ ! 435

క. తొలఁగినను జవ్వనము త
ద్విలాసములు దీసిపోవు వెలఁదులకెందుఁ ;
బొలిసినను రాజ్య మద్దా
ని లక్షణంబులు దొలంగనేరవుగాదే ? 436

*క. మరులుగొని మగువలు పర
స్పర మధరములానుకొనుచు, సమ్మదమునఁ గొం
చరుకుచములు, ముద్దాడుచుఁ,
గరంబుఁ దా ర్పెనఁగుకొనుచుఁ గల రంతిపురిఁ 437

---

"The ancients at first believed that both man and woman secreated the seminal fluid, and in Sushruta, (సుశ్రుతము) the most ancient medical literature in India, it is even mentioned that 'When two excited women rub their genetalia against each other, they emit semon, as the result of which a child without bones is born'."

Kama Sutra Page 54.

బాణభట్టకృత కాదంబరిని సంగ్రహించిన యభినందుని కాదంబరీ కథాసార మున 8 సర్గ ౧౪ వ శ్లోకము గనుఁడు.

"తాతస్త్వామాదిదేశైకం వత్స ! దోష స్తవాత్ర కః ?
రజోవికృతయో యుక్తా శ్శుద్ధస్త్రీబీజజన్మనామ్."

క. తన ప్రియకాంతుని నామము
వినికృష్ణుండనుచుఁ దొంటి పేర్మారిచి చె
ప్పెను బెండ్లికూఁతు రల రు
క్మిణి యని మెచ్చంగ మేలుమేలని పెద్దల్. 438

చ. అలరు విలాసమందిర
గుహాగ్ర సుమతల్పకుశాసనంబుపైఁ
బొలుచుచు మేనఁ జందన విభూతి
నలంది సుమస్రజంబుఁ దా
వళముగఁ బూని తాల్చి వలిపంబను
కావినిఁ గల్కి బత్తిఁ బు
వ్విలుతు గుఱించి తద్దయుఁ
దపించు నిరంతరభోగలబ్ధికై. 439

క. ననుఁగని నగు; విఱుచు నొడల్;
తన పయఁటను దూల్చు; నడుము స్తనములు; మోవిం

కపింజలుఁడు చిలుకరూపము నొందియున్న పుండరీకునితో "నీ తండ్రియగు శ్వేతకేతువు నీ కి ట్లాదేశించుచున్నాఁడు. 'ఇందు నీ దోషమేమి? శుద్ధ స్త్రీ బీజము వలనఁ బుట్టినవారి కిట్టి రజోవికారము లుచితములే' అని చెప్పెను. లక్ష్మి శ్వేత కేతువును గాంచి మోహమునుబొంది తేజఃస్ఖలనమొందినది. దానివలనఁ బుండరీకుఁడు జన్మించెను. కావునఁ గేవల స్త్రీబీజము వలనను సంతతిగలుగుట గలదు.

దీనినిఁబట్టి కామాతురలగు స్త్రీ యుగ్మము వరస్పరము రతియొనర్చుట గలదు. మరియు వాత్స్యాయన కామసూత్రమున నిట్లు గలదు:

అంతఃపురగతాః కాశ్చిత్ స్త్రియ శ్చాప్రాప్తఖాండకాః
భగే హ్యన్యోన్యవిశ్వాసా త్కుర్వంతి ముఖచాపలం.

ఇందు ముఖచాపలమనియే యున్నది, ఇదియుపలక్షణము. దీనిచే సురత వ్యాపారమూహ్యము.

గొనపంటనొక్కుఁ ; గండ్లా
ర్చును ; దెగఁబడెను బ్రతివేశసుందరి యిట్టుల్. 440

క. రమణీమణి మంగళసూ
త్రము మొదలగు స్వర్ణమయపదకములఁ బతిచి
త్రముఁ జెక్కించుకొనెను ; ని
త్యమును దదాలింగసౌఖ్యతత్పరమతియై 441

క. మదవతి తన్నుంగూఱిచి
మది ననుమానించి వదరు మగనికి ననియెన్
"వదరుదు ; వేమెఱుఁగుదు ? నా
మొదటిమగఁ డెఱుంగు నాదు పుణ్యచరిత్రన్". 442

గీ. వలపుఁజిమ్ము రేరాణి కేవలము రాత్రి ;
చిమ్మదువు రేయుబవలును జెలువ ! నీవు
మల్లెపూ విచ్చు రేలను మాత్రమవుర !
నీ మొగము నవ్వుమల్లెలు నిచ్చ విచ్చు. 443

క. పతిచిత్తర్వును దేవుని
ప్రతిమకడంబెట్టి సలుపుఁ బడఁతుక పూజల్ ;
నితరాము పూలువేయును
పతిబొమ్మ సహస్రనామపాఠముతోడన్. 444

క. కలికీ ! కలిగినవారికె
పలువురు చుట్టములు ; నీకు బావలు, మఱఁదుల్
పలువుంద్రు మేనమామలు
గలారు ; నీదెట్టి సౌభగమొ తలఁపంగన్ ? 445

గీ. "కలదు సంతానయోగంబు కలికి" కనుచుఁ
"బతికి లే"దంచు జ్యోతిషపండితుండు
పలుక జాతకములుచూచి పక్కుమనిరి
సరసులెల్లరు ; తద్భర్త శిరసు వ్రాల్చె. 446

గీ. పాటఁబాడక తనపైఁ ద్రిభంగి నిలిచి
పరయువతిపైని నవ్వుచుం బాడుచున్న
హరి వెనుక నిల్చి రాధ స్వీయాంగుళులను
వేణువివరంబులం దాఁకి పేరుత్రిప్పె. 447

క. "మొదలన చక్కెరబొమ్మవు ;
మదిరాక్షీ ! నీదుమోవి మధురతర సుధా
స్పద"మన నవ్వుచుఁ జెలియనె
"నదృష్టముపయి న్నదృష్ట మబ్బెను నీకుఁ." 448

ఆ. నేను బాటఁబాడ నెలఁతుక శ్రుతివేయు ;
లయనుదట్టు లలన లాస్యమాఁడు ;
జావళీల్ రచింపఁ బ్రావీణ్యవతివోలె
నభినయించుఁబో ! తదర్థమెల్ల. 449

క. ఎదురెక్కుచున్న నన్నుఁ
సుదతీమణి స్వీకరింప సోపానములం
బదములు దొట్రిల వ్రాలెం
దుది నాపయి ; రొట్టెవిఱిగి నోటంబడెఁబో ! 450

క. ఎలదోఁట లతయు, గృహమం
దు లతాంగియు, నొక్కనాఁడె తొడిగిరి మొగ్గల్ ;

అలరుంగుత్తులు దాల్చిరి ;
వలపులు వహియించి ; రయి రుపాశ్రయసుభగల్. 451

క. కనుబొమ్మలు మోపెట్టెదు ;
కనంబఱతు గుబ్బ చన్నుఁగవ ; ముంగురు లొ
డ్డి నిరోధింతువు గమనము ;
వనితా ! నను బ్రదుకనీయవా ? నా సఖితోన్ 452

ఆ. "వత్సరాదినాఁడు బాలరో ! సలుపు కా
ర్యంబు సాఁగు వత్సరాంత మంత
రాయరహిత" మంచు నాడంగ నే, బొమ్మ
ముడిని విప్పి పూలజడను ముడిఁచె. 453

క. నినుఁ జొర 'నణిమ', నితంబముఁ
గొన 'మహిమ' వహింప 'గరిమఁ గుఱువులపైఁ గూ
ర్చొన 'లఘిమ' నిల్పె నీకయి
వనితామణి ! సిద్ధులకుఁ తపం బొనరింతున్. 454

గీ. లేవు తిథివార దోషముల్; లేవు త్యాజ్య
సాంధ్యసమయాది దోషముల్ జవ్వనులకుఁ;
బొలఁతి ! కంచపు మంచపుఁ బొత్తులయెడ
క్షితి నిషేధంబు లంగజస్మృతిని లేవు. 455

గీ. సప్తభూమంబు నీదు ప్రాసాద శిఖర
మందుఁ జరియింతు వప్సర స్సుందరివన
నీదు దృగ్జాలపాశంబు నెలఁత ! విడుము !
ప్రాఁకికొని వత్తుఁబైకి నీ పార్శ్వమునకు. 456

గీ. "వనితా! మగవాఁడవుగా
జనించియుండవలసినది; చానవయి" తనన్
"జనియింపవె నీ వత్తఱి
ననఁబోఁడివిగా?" నటంచు నవ్వె విటి విటున్. 457

క. ఉత్తానశయులు వేల్పులు;
బిత్తరి! యవమూర్ధశయులు పృథ్వీజనముల్;
సత్తెం బప్సరసవు; నీ
హృత్తలమున నే శయించుటే యుచితము సూ! 458

క. పురుషాయితమున బాలయుఁ
బురుషునిఁ గీడ్వఱచి నిక్కెఁ బొగరెక్కి కడున్
బరికింపఁగ నడుమంత్రపు
సిరిపట్టిన వారి కథలు చిత్రములు గదా! 459

ఆ. కన్నెయొకతె నిమ్మకాయను వడ్డింప
దబ్బకాయఁ దెచ్చెఁ దరుణియొకతె;
నాకునా కటంచు నలుగురుతరుణులు
నెగఁబడంగ నవ్వ చింతి నిలిచె. 460

క. "మగువా! యొక్కరు పండం
దగినది; యిర్వురికి నిఱుకుతల్ప" మనఁగ నొ
క్కగరిత; లాఁతియనె నగుచు,
"నగు నొకటిగ జంట దీని నధిరోహింపన్." 461

గీ. కలికి! యాకులుఁ బోఁకలుం గలవు; చాలుఁ;
బరుల యాచింపకు సుధాద్రవంబుకొఱకు

నేఁడు వానినిఁ జర్వించి గాటుగల ప
రస్పరాధరసుధ లాన రాగమెక్కు. 462

ఆ. మల్లెపాన్పుమీఁద దెల్లచీరంగట్టి
తరుణి పండెఁ దెల్లత్రాఁచువోలె
డాసినట్టిప్రియుఁ దటాన నాపాదమూ
ర్ధముగఁ బెనఁచి వేసెఁ దద్ద కాట్లు. 463

క. కనుచుండ ముఖేందువు నా
కనుఁగవ నీ చనుల జాటి కడుఁబొరలుచు నీ
ఘనజఘనంబునఁ, బెందొడ
లను బడియును మరలనెక్కు లాలసనొందుణా. 464

ఆ. "ప్రియుఁడు వచ్చు నేఁడు; మెయిఁజక్కఁ గైనేసి
గడపకడనె వానిఁ గౌఁగిలింతు ;
నతఁడు నన్ను ముద్దులాడు"; నంచును బైటఁ
జేరి వగచె వానిఁ జేర కకట. 465

గీ. "ప్రొద్దుతిరుగుడుపువ్వనాఁ బువ్వుఁబోఁడి !
తిరుగు నీ మోము సతము నా దెసకె" యంటి
"నెవ్వరితమీఁదఁబడునొ నీ దృష్టియంచుఁ
గాంచుచుంటి" నటంచును గలికి నవ్వె. 466

గీ. లలవరో ! నీదులావణ్యలహరియందు
గుండ్లుదేలెను జిత్రంబు బెండ్లువోలె ;
వాని నడిమినిఁ బ్రవహించు పాయనాఁగఁ
జిలుఁగుఁదెలిపైఁట నేయుఁ గన్నులకువిందు. 467

ఆ. బాల మొదట రేఁగుబండ్ల నమ్ముచు వచ్చెఁ;
నెలకు నమ్మఁదెచ్చె నిమ్మపండ్లు;
దబ్బపండ్లు దెచ్చెఁ దట్ట రెన్నెల్లకు;
నేమి తేరఁగలదు? యెఱుఁగ రేఁపు. 468

క. "నా పండ్లు చూడు పెద్దవి;
నాపండ్లుఖమైన" వంచు నన్ఁబోం డ్లిరువుర్
పైపైకి వచ్చి; రొక్కతె
నా పాణుల ఫలములని స్తనంబుల నునిచెన్. 469

క. "ప్రియురాల! వింటె? "అత్యు
చ్ఛ్రయః పతనహేతు"వన్న శాస్త్రమని నగన్
స్మయవదనయై "ధ్రువేఽవ్యా
ప్తి" యటంచుం గలదు వింటివే?" యనె నదియున్. 470

క. "యువతీ! ఈ పరకాయ
ప్రవేశ విద్యఁ గఱచి తెటఁ బలుకు" మనఁ బ్రియుం
డు, వధూమణి యనె "నా క్రా
నువంశికము లెమ్మిట్టి విద్య"నుచుఁ గడునగుచున్. 471

క. ఇదివఱకె చెలి కృశాంగివి
గద! చిక్కితి మిగుల; నేమికత? మన ననె నీ
వదయత నా గాత్రలతం
బదింబదిగ నఱుగఁదీసి ప్రశ్నింతేలా? 472

క. ప్రతివేశిని! సతతము నా
సతివలె నడతువు; హాయల్ దెసలఁ జిమ్మ, చలం

కృతులఁ, జిలుంగులఁ దా_ల్తను
కృతిచేత బలాక హంసి యెట్లగుఁ జెపుమా!

ఆ. చేతులె_త్తి బ_త్తి జోతల నిడవచ్చు;
దేవుఁ డనఁగ నాదు బావసెల్లుఁ;
బలుకఁబోఁ డొకప్డుఁ బల్లెత్తుమాట మా
యక్క యెచటి కెచటి కరుగుచున్న.

గీ. తరుణి నమ్మి "యశ్వత్థ ప్రదక్షిణముల
గర్భమగు" నంచు నమ్మలక్కలు వచింపఁ
జేసి యొక్కొక్కటే ప్రదక్షిణము బేల
కడు పెదుగుచుండెనో యని తడవికొనును.

క. కుడిబుజ మదరెను నాకు
న్పడంతి; కేమేమి లాభనష్టములో? యం
చెద శంకిల సంజతటిం
బడవందిగి యొంటి నాదు మఱఁదలు వచ్చెన్.

క. ప్రియురాలు గట్టె గు_త్తపు
రయికం దన చారుపీవర_స్తనయుగముం;
బయిబ్రాలిన నా చి_త్తం
బయారె? రాదయ్యె; బద్ధమయ్యెనొ? యచటన్. 477

క. తన చారిత్ర్యముఁగప్పం
గ నితంబిని తొంటి పేరు గాదంచును మా
ర్చెను 'సీతాదేవి' యటం
చు నమాసను బున్నమన్నచో నిరు లఱునే? 478

గీ. ఎదురుమెల్లెక్కివచ్చుచు నిగురుఁబోఁడి
క్రిందికిందిగ్గు నాబుజాల్ కేలఁబట్టి
రొమ్ములంగ్రుమ్మి పైపైకిఁ ద్రోసికొంచుఁ
బోయె ; నేటికి నెదురీఁది పోవుకరణి. 479

ఆ. మొగ్గవేయు ; వ్రాలు ముందుకుఁ ; ద్రైవిక్ర
మావతారమెత్తు ; నవ్వి యివ్వి
రంగమందుఁ జూపు రమణి క్రీడలు ; రతి
బంధచాపలంబుఁ బగటుచేమొ ? 480

క. గురుఁడడుగ "లేఖ వ్రాయుము
తరుణీ !"యని మదనలేఖఁ దగ లిఖియించెన్
బురుషార్థంబుల నెయ్యది
వరిష్ఠమనఁ "గామ"మని జవాబు వచించెన్. 481

క. విటికై తనపతి యొక ని
ష్కుటమున నుండఁగ వాని కోమలి యటకే
విటుఁ గవయవచ్చి పతిఁగని
"యెటనుంటివొ యంచు వెదకు చే వత్తు"ననెన్. 482

క. ప్రతివేశిని నా బాలుని
సతంబు ముద్దాడుఁ ; గొలుపుఁ జక్కిలిగింతల్ ;
అతుకును రొమ్మున నీ దృశ
సుతుఁడు దనకు వలసినట్లుఁ జూపులఁదెలుపున్. 483

క. మధురము వదనం ; బధరము
మధురతరము ; గుచయుగంబు మధురతమమగున్ ;

మధురంబుగాని దెయ్యది ?
పృథివిని 'స్త్రీ' యన్న నామమే మధుర మహో ! 484

క. ఉఱుముఱిమినఁ, గడుఁ బ్రేలిన
ఫిరంగి, కంపిలుచుఁ బఱచి వెలఁదుక నన్నుం
గరమదికి పట్టు వదలద ;
యరయఁగ సందుసుడిమాయలాఁడులు చేడెల్. 485

గీ. ఫాల్గునికమాసమందలి పౌర్ణమాసిఁ
బలుకును జనంబు కామునిపండుగనుచుఁ ;
జెలువుఁ డెటకేనిఁబోయి విచ్చేయునాఁడె
పడుచుపిల్లలు కాముని పండుగంద్రు. 486

క. రవికెలపండుగు దినమున
నవోఢయగు యువతిరయిక నాకు దొరకెఁ ; ద
ద్యువకునికి వృద్ధురాలిది ;
కవగూడిన మమ్మతండు గని కుమిలె నెదన్. 487

క. లలనాతిలకము కుంకుమ
తిలకముఁ గైనేసి యళికదేశంబునఁ దే
జిలు ; మామకరక్తమనో
జలజం బంటించుకొన్న చందమున బళా ! 488

ఆ. మిద్దెమీఁదనుండె ముద్దులగుమ్మ ; చె
ల్వుండు మేడక్రిందనుండి దింపఁ
జేతులెత్తెఁ బైకిఁ ; జెలువ మెల్లఁగ జాఱె
స్వస్స్రవంతి శివునిపైకిఁ బోలె. 489

ఆ. "పట్టుదారమట్లుఁ బరిఢవిల్లుఁ ; గటీర
సూత్రమేవనికగునో ? సుందరాంగి"
అని తలంచుచుండ నాలించితిని నుప
శ్రుతినిఁ ; గుడిబుజంబు సొరిదినదరె. 490

క. భగవద్దర్శనమిషతో
మగవాండ్రును మగువ లెడఁదమ్రగ్గుచుఁ దముఁ గూ
ర్పగఁ వేఁడ మేనులందం
బుగ సింగారించి గుడికిఁ బోవుదు రరుగో ! 491

క. తారాచంద్రులు వీరని
వారలువీరలును వ్రేలుపై కెత్తి మముం
గూఱిచినవ్వుదు ; రిలఁ బ్రతి
వారికిఁ గార్యములమాదు బాసపెవలయుఁ. 492

క. విసరినను జెండ్లు నాయెదఁ,
గసిఁబూనినయట్లు పంటఁ గాట్లుపఱచినఁ
వసమఱి నన్నుం దిట్టిన
రసికారత్నంబు నాదు రమణీమణి పో ! 493

గీ. తొలుతఁ జవిఁజూచి తా రుచ్యఫలము లేఱి
శబరి సద్భక్తి శ్రీరామచంద్రమూర్తి
కట్టు లర్పించుచుండు నా కలరుఁబోఁడి
ప్రేమఁ జర్వించి కప్పురవీడియంబు. 494

క. చిఱునవ్వుల ననుఁ గనుచుఁ
దరుణీరత్నంబు నామనంబిడి యందుం

గిరగిర త్రిప్పుచు నున్నది
తిరుగలి; యది నలిఁగి పిండి తీరగుచుండెన్. 495

క. "మడిదానను దాఁకకు"మని,
కడు నెడగా నిలిచి కలికి, కాంతుఁడు దనపైఁ
బడరాఁగఁ దాను వెనుకకు
నడచినడచి శయనగృహమునకె నడచెఁ దుదిన్. 496

ఆ. వక్రభాషణంబు, వక్రవీక్షణము, వ
క్రాలకములు, వక్రమైన గతియుఁ
గలిగె నెట్లు నీకుఁ గలికి; యే వక్ర
బుద్ధి కడుపునందుఁ బుట్టినావె? 497

ఆ. పన్ని సున్నితంపు సన్ననూల్గూఁటిని
బొంచి వ్రాలుకీటములను బట్ట
నున్న సాలెపురుగు నోజఁ జిల్గునఁ బొంచె
నిగురుఁబోఁడి పట్ట నెమ్మెకాంద్ర. 498

గీ. దారి నడచుచు నాయిల్లు దఱియఁగానె
కాలుబెణుకును ; జాఱును గలికి మిన్న ;
అంతఁ గుంటుచు వెనుజూచు బడుగులిడుచు
నడచునట్టి యొయ్యార మెయ్యెడలఁ గనను. 499

క. అటువచ్చి ముద్దుగొని చను ;
నిటువచ్చి కవుంగిలించు నిగురుంబోఁడిన్
అటుపిలిచి యధరమానును ;
నిటుపిలిచి ప్రియుండు పట్టు నెలమిం జన్నుల్. 500

క. తరుణీమణి ! నీ మధురా
ధరామృతరసంబు నిచ్చఁద్రావుటఁజుమ్మీ !
విరచించుచుంటి రసవ
త్తరంబులగు కావ్యములఁ ; గృతజ్ఞుఁడ నీకున్. 501

క. తారాశశాంకవిజయముఁ
బారాయణసేయు ; వినును భక్తి నహల్యా
జారచరిత్రముఁ ; జేయును
మారార్చనఁ గడు గడింప మగువ సుఖంబుల్. 502

క. 'మడిఁగట్టితి తాఁకకు' మన
మడంతి ప్రియుఁడనియెఁ "దాఁక మడి ; నీవే ము
ద్దిడు మొక్కం ; డీ వచ్చును
మడివిడిచిన వెనుకనే సమాలింగనమున్." 503

క. తరుణుఁడు చనెఁ దరుణీమం
దిరంబునకుఁ ; దరుణి బయలుదేఱెను మునుమున్
దరుణునికై పెఱత్రోవను ;
బరస్పరముఁ గలియకార్తి వార్తిరిగి రిటుల్. 504

క. కుఱువును దలాడగాఁగొని
పరుండెఁ బ్రియునొడిని యువతి ; వదనానిలమా
సరసుం డూఁదెను ; సోఁకెనొ ?
మరుగాలి హసించు ; నఱచు ; మైకముతోడన్. 505

ఆ. దిష్టిఁదీయుచుండు నిష్టుండు తరుణి పే
రంటమునకుఁ బోయిరాఁగ మరలి

వీథికరిగిరాఁగఁ బ్రియుఁడు మించుంబోఁడి
దినదినంబువెట్టు దిగదుడుపును. 506

క. "మృతుఁడైన భర్త నాదగు
పతివ్రతాత్వమునఁ దిరిగివచ్చె బ్రదికి" యం
చతివ వచించుచుఁ దనపతి
ప్రతిరూపంబైన నాకు స్వాగతమొసఁగెన్. 507

క. శయనతల్పమందుఁ జదరంగమాడంగఁ
దొడఁగెఁ దనదు రాజుతోడ రాణి
రాజు వ్యూహములను రాణి భేదించుచుఁ
ద్రోసిరాజుఁజేసెఁ దుదికి నాట. 508

గీ. 'వలచితిఁ బ్రియా !' యనుచు నేర్పఁ బాట గురుఁడు
"వలచితిఁ బ్రియా !" యనుచు శిష్య పాడు నగుచు;
"నధర సుధలిత్తె ?" యని పాడ నా గురుండు
"నధర సుధలిత్తె ?" యని నవ్వు చతివ పాడె. 509

క. "మనయింటఁ దేనెగలదే ?
వనజముఖీ ! యౌషధానుపానార్థ"మనన్
అనె నవ్వుచు "నీ మందున
కనుపానం బధరసుధ గదా ! కలదు ప్రియా !" 510

ఆ. పసిఁడిబొమ్మయైన బాల "బంగారక్క"
యనుచు బావ మేలమాడ నదియు
"నట్లయేని నీవు నగుదువుపో ! కేతి
గాఁడవనుచు నలుకగదురఁ బలికె. 511

క. "నా కళ్ళతోడఁ జూడుము
నాకాంతుఁడు గోచరించు నవమన్మథుఁడై
నీ" కన సతి తత్సఖి "సరి !
నీ కళ్ళిడు; నాదుకళ్ళు నీకిత్తు" ననెన్. 512

క. ఇల మేల్మిపసిఁడిబొమ్మకు
వెల గట్టఁగవచ్చుఁ ; గాని వెల గట్టంగా
వలనుపడదు ; మా యింటం
బొలుపాఱెడు నల్లపసిఁడిబొమ్మ కయారే ? 513

క. ఒకపరి పువ్వులకోస,
మ్మొకపరి "తమ్మలపుటాకు లున్నవె ?" యనుచున్
ఒకపరి తేనెకుఁ ; బ్రతివే
శకాంత యరుదెంచు నది నిజంబో ? మిషయో ? 514

ఆ. బాల ! మరుని పూర్ణపాత్రికవేమొ ? నీ
తియ్యమోవిఁ, గౌనుఁదీఁగ, మరియు
గుబ్బచన్నుదోయిఁ, గుఱువులం గొనఁగోరు
నహమహమికమై మదంగకములు. 515

క. ఒకగదినిఁ గూఁతురల్లుం;
డొకగదిఁ గోడలును గొడుకు; నొకచో ముదిపా
ల్తుకయును గేస్తును గూడిరి;
మకరాంకుని సాముగరిడి మందిర మరయన్. 516

ఆ. కోయిలట్టు లెదుటఁ గూర్చుండ సరసుండు
శ్రవణపేయముగను యువతి పాడుఁ ;

గూరుచుండ మగఁడు గొంతు విస్వరమయి
శ్రుత్యరుంతుదమయి రోఁతగొలుపు. 51?

గీ. అగపడుదు వేకమూర్తిఁ బ్రత్యక్షమందుఁ;
గాని బహుమూర్తివై పరోక్షంబునందు
దశదిశల నిండ వింతగాఁ దాండవింతు;
మాయలాఁడివి సుమ్మ ! కొమ్మా ! తలంప. 518

గీ. కలికి కట్టెడు దువ్వల్వఁ గట్టి తమిని
రమణి పయ్యెద నుత్తరీయముగఁ దాల్చి
పడఁతి కైసేయు కుడితినీఁ దొడిగికొనియుఁ
బతి దలఁచె నింతిమెయిని దూఱితినటంచు. 519

క. చెఱుకా ! బెల్లం బిడుమన
మరియాదగ నిడునె పట్టి మర్దింప కిలన్
దరుణీమణి ప్రకటించునె
సరసతఁ బ్రార్థనలఁ; గాక స్తనమర్దనలన్ ? 520

గీ. మొదటఁ గళ్ళప్పగించి కెమ్మోవి నొసఁగెఁ ;
బిదప గిళ్ళప్పగించెను గొదుకకలఁతి;
తుదిని నొళ్ళప్పగించెను ముదిత నాకుఁ
ద్యాగమూర్తి యనంగ నా తరుణి దనరు. 521

గీ. "ఆటవెలఁదివె ? సతత మిట్లాటలాడె
దలరుఁబోఁడిరొ ?" యన నీకు నాటవెలఁది
ప్రియయగుటఁ జేసి నే నాటవెలఁదిగాఁగఁ
గడఁగుచుంటి" నటంచును గలికి నవ్వె. 522

క. "అనిమిష కన్యకవే? చెలి!
కనురెప్పల వాల్పఁబోక కను" దన ననె "నా;
ననుకూలవరుఁడు వేల్పులఁ
గనరాక నినుఁ వరింపఁగా వచ్చితిఁజూ!" 523

క. చక్రాలు నీదు కన్నులు;
చక్రాలనఁజెల్లు నీదు చన్నులు; యువతీ!
చక్రాలు నీ పిఱుందులు;
చక్రాలాఱుగల పుష్పశరుని రథమవో? 524

క. చెలువయుఁ జెలువుండును అం
కులరాట్నంబెక్కి తిరుగుకొనుచుండిరి పు
వ్విలుతుఁడు రేఁపిన వలగా
డ్పులో సుడియు చిత్రపత్త్రపుత్త్రికలటుల్. 525

క. అనుకొంద్రపశకునంబని
కనఁబడ నా బాలవిధవ; కడు శుభశకునం
బని నేఁ దలంతు; భువి నా
క్కని కహితమగు ఫలము మఱొకనికి హితమగున్. 526

క. "నీతో నను రమ్మందువా?
నాతో వచ్చెదవా? యంగనామణి! నీకిం
దేతీరు ప్రియం?" బన నది
నాతో నీరాకె ప్రియము నా'కని నవ్వెన్. 527

క. తనపెండ్లిఁ జూడవచ్చిన
తనదు ననుపుకానిఁ గాంచి తరుణి యెదుట నా

తని తల నేసలువోసెను
మనసు చెదరి విస్తువోవ మదిఁ బతిముఖ్యల్. 528

క. "కనుసన్న లెచటఁ గఱచితె ?
కన బాలికవయ్యె" ననుడుఁ గన్నియ యనియెన్
"అనయంబు నిలిచి వాకిట
నొనర్చు మా యక్క యరుగు యువకులఁగనుచున్." 529

క. "ఈ కొమ్మ పూవుగుత్తులు
నీ కందును గోయు"మనుచు నెలఁతుకఁ జూపన్
"నా కంద వవ్వి ; యందును
నాకివి" యని ప్రియుఁడు రొమ్మునం జెయివేసెన్. 530

క. "ఎరవిత్తువె నీ కన్నులు ?
ఎరవిత్తువె నీదుచన్ను ? లెరవిత్తువె సుం
దరి ? నీకెమ్మోవిని ?" నని
తరుణులు యాచింత్రు సంతతము నాదుచెలిన్. 531

ఆ. పండువుగఁదలంచి ప్రతివత్సరమునందు
ప్రథమసురతకేళి భాగ్యదినము
నలరుఁబోఁడి పేరఁటాండ్ర నాహ్వానించి
వేఁడుకల నొనర్చి విందు సేయు. 532

ఆ. చెలువ గూరుచుండె మెలమెల్ల సరసుండు
వెనుకవచ్చి దాని కనులు మూసె ;
మేనమామకొడుకొ ? మేనత్తకొడుకొ ? యం
చతివ పేర్వచింప మతినిఁ గొదికె. 533

క. "పిల్లలతల్లివి యయ్యును
బిల్లవలెందోఁతువెట్లు విరిఁబోఁడి
బల్లవుఁ, డదియనె నవ్వుచు
నుల్లాసముగొలుపు యౌవనౌషధివి గదా! 534



గీ. లలితమగు నా దుకూలాంచలముననుండి
నూలిపోగూడి నింగినిఁ దేలియాడు
చెదురుగావచ్చు కొమ్మరొమ్మెలసి మెడకుఁ
జుట్టుకొని శోభిలెను గంఠసూత్రమట్లు. 535

ఆ. "పోరి!" యన్న నను "బోరగాఁడా!" యని;
"పిల్ల!" యన్న ననుచు "బిల్లగాఁడ!"
యనుచుఁ; "జెలువ!" యన్న నను "జెలువుగాఁడ!
యంచు; మఱఁద లలుక మించి బావ. 536

క. "క్షమియింపుము! పొరపడి నిను
రమణీ! నా పత్నివంచు రమ్మంటి" నన౯
బ్రమద "విని నీ తెలుంగును
భ్రమించి పతివంచుఁ దఱియవచ్చితి" ననియె౯. 537

క. ముత్యాలకోవ పలుగమి;
ముత్యాలను జల్లు నవ్వు; ముత్యాలసరుల్;
ముత్యాలకమ్మ; లువిదా!
ముత్యాలం గూర్పఁబడ్డ బొమ్మవొ? యేమో? 538

క. చదివింపుగఁ 'గొక్కోకముఁ
జదివించె వివాహవేళ సఖి యొక్కతె స

మ్మదమునఁ దన సఖి; కాచెలి
తదుపద సర్వోత్తమముగఁ దలఁచుకొనె మదిన్. 539

క. తనదగు సరసుల పేళ్ళకు
ననుగుణముగఁ దరుణి "ఉమ" యటంచును "రమ" యఁ
చును 'వాణి' యనుచుఁ దెలుపును
స్వనామధేయములఁ బూతభావము దోఁపన్. 540

క. తనచుట్టంబులు చూలా
లని సూడిదలంప యువతి యయ్యవి యెల్లన్
తనునట్టి భాగ్యవతిఁ జే
సిన తనచెలికత్తె కంపెఁ జేమోడ్పులతోన్. 541

ఆ. "నాఁటికన్న నాఁడు బోటిరో! కడుఁగడు
సన్నగిల్లెదేల?" యన్నఁ బ్రియుఁడు
"ఇముడ నీ యెడంద నెంతేఁ దపించుచుఁ
జిక్కిపోతి" నంచుఁ జెలువ నవ్వె. 542

గీ. కలికి లావణ్యమును గాంచవలయు నన్నఁ
గాదు పగలిఁట; రాతిరిఁ గాంచవలయుఁ;
బగలు శశిరేఖ వెలవెలఁ బాఱుచుండుఁ;
గ్రాలు నత్యుజ్జ్వలంబయి రేలయందు. 543

గీ. క్రుమ్మఱకు మిద్దె; నిన్ను మేఘుండు తరుణి!
జాఱిన తటిల్లత యటంచు సంగ్రహించుఁ;
జొక్కి శశి డాయుఁ 'జక్కనిచుక్క' యంచు
అచ్చర యటంచుఁ బట్టు వియచ్చరుండు. 544

క. పెరుగమ్ముగొల్లపడుచులు
దరిసిన క్రేతలకుఁ గప్పుఁ దలఁగించి “ఇఁగో!
పరికింపుము నా ముంతను
బరికింపు” మటంచు వత్తు పైపైకిఁ దగఁ. 545

ఆ. నాదుజ్ఞాతివాని ననఁబోఁడి మాదృశుల్
పిలువ “వదినె!” యనుచుఁ బిల్లలెల్ల
“వదినె! వదినె!” యనిరి; తుదికిఁ బెద్దలు నట్లె
పలుకఁదొడఁగ వాడవదినె యయ్యె. 546

క. పెనుగాడుపునకు యువతీ
స్తనాంశుకంబెగిరిపోవఁ దడఁబడుచది ని
ల్చెను ; నాసంవ్యానముఁ ద
త్క్షణంబునం దెగిరివ్రాలె దాని యురముపై! 547

ఆ. నిన్ను ముద్దులాడి, నీ మోవినిం గ్రోలి
యలరుబోడిఁరో! ప్రయాణమైన
నాఁకలియును దప్పి నాకుఁ గల్గవు సుమ్మ!
మఱలివచ్చుదాఁక మార్గమందు. 548

గీ. కట్టితివి చీర నొడలెల్లఁ గానిపింపఁ;
దాల్చితివి పైఁటఁ జందోయి దాఁగకుండ;
చూడనట్టులు చూతువు కోడెగాండ్ర;
బాల వౌదువె? స్మరకళావతివిగాక. 549

ఆ. వలువలందుఁజుట్టి చెలువరో! దాఁచు నీ
పాఁతులెల్ల బయలుపఱతు లెమ్మ!

రవియెఱుంగకున్నఁ గవియెఱుంగు నటందు ;
రేను గవినటంచు నెఱుఁగ వోటు ? 550

క. తనవలపుల రాణికిఁగవి
తన విరచిత భాణ మంకితంబొనరిచె ; నా
తని కది వేయార్ముద్దులు,
ననేకపరిరంభణము లుపాయనమొసఁగెన్. 551

ఆ. పాన్పుపయిని భర్త్రప్రక్కనె పవళించి
పడఁతి కపటనిద్రఁ బలవరించె
"నాథ! చరణదాసి నన్నేలుకొ" మ్మని
దాని యీలువున కతండు మెచ్చ. 552

క. చనుదెంచుచుఁ బతికయిదం
డనుగొని మగనాలు డాసిన విటుం గని సి
గ్గునఁబోలె జరిగి వెనుకకుఁ
గనుగలువలదండ వాని గళమున వయిచెన్. 553

ఆ. పన్నిదంబు సఱచి పాడందొడంగిరి
కోయిలయును నాదు దోయలియును
బరభృతంబు పాడిపాడి యామని నెల్ల
సాటిగా నటంచుఁ బాట మానె. 554

గీ. గుడిగినొడలికిఁ, గాళ్ళకుఁ బొడుగుతొడుగుఁ,
పరగు జిలుఁగు త్తరీయంపు వల్లెవాటు,
నిట్లు మగవేసముందాల్చి యిగురుఁబోఁడి
తనదు పురుషాయితంబు సార్థకమొనర్చె. 555

క. పిలువఁగ "వదినే?" యని నా
పొలంతి పొరుగింటి పూవుఁబోఁడిఁ, దెలిపి యా
చెలి బాదరసంబంధముఁ
"జెలియలి" నీ కనియె దాని చిత్తం బద్రువఁగ. 556

క. ఇఱుకత్తు లిముడవం డ్రొక
యొఱలోఁ; బువ్విల్తు కత్తు లొద్దిక మెయినొం
డొరువులఁ బేర్కొని యొకచో
యరుదనఁగా నిముడు నే గృహంబున నేనిఁగ. 557

ఆ. తమ్మిపూల యద్దకమ్మొప్పు వలిపంబుఁ
దాల్చి నిలిచెఁ దరుణి ద్వారమందు
వచ్చిపోవు యువకవారంబుఁ గాంచ నొ
శ్శెల్లఁ జేసికొనెను కళ్ళు నాఁగ. 558

ఆ. పడఁతిరో! మదీయ ప్రాణవాయువులను
నపహరించుచుండె నంగజుండు
నీ ముఖానిలమును నింపుదే నూపిరి
తిత్తులందు బ్రతుకుతెరువు గలదు. 559

క. అల క్రొత్తనీటికిం జే
పల గమి యెదురెక్కునట్లు ప్రమదామణి చూ
డ్కులు దమి నెదురెక్కెడుఁదన
వలకాఁ డాత్మాభిముఖము వచ్చుచునుండన్. 560

క. "సుభగా! త్వదాశ్రయంబున
సుభగుఁడ నేనె తి" నంచు సుందరుఁ డనఁగన్

"సుభగుని నినుఁగూడుట నా
సుభగాత్వము సఫల"మనుచు సుందరి నవ్వెన్. 561

క. నాయంగరకాఁ దొడుగును;
నాయొల్లియఁ బీవర స్తనంబులఁ దాల్చున్
నాయున్ని సేల్వఁగప్పును;
నాయాలింగనము గాంచినటు చెలి యలరున్. 562

క. "చవుసీతి బంధనముల, ద
శవిధములగు చుంబనములఁ, జదురవయితి వ
ష్టవిధాలింగనములఁ," నని
పువుఁబోఁడిని మెచ్చి పట్టము గురుం డొసఁగెన్. 563

క. అలికిడి విని నను విడి నా
వలువను సరభసముఁ దాల్చి వచ్చిన నా కో
మలిఁ జుట్టి నవ్వ చడిగిరి
"చెలి! యెటఁగొని తింత వింత చీర"ని సకియల్. 564

ఆ. ఇంతి కాపురాని కేతెంచి మర్నాఁడె
కొలువుగాని నుంచుకొనియె నింట;
నబల తాను; మగఁడు నబలుండు; కార్య ని
ర్వహణ మెట్లటంచు వగచి కడిఁది. 565

క. "పనివానిఁ గుదుర్చు" మనం
"బనికత్తెఁ గుదుర్తు" నంచుఁ బతి పడఁతి కనెన్
"బనివాఁ డొనర్చు పనులవి
పనికత్తెకు నెట్లు సాధ్యపడు ?" ననె నదియున్. 566

ఆ. అత్త ద్వారమునకు నడ్డంబు గూర్చుండె;
దిడ్డిత్రోవ నాడుబిడ్డ గాచె;
దాసి వేసమూని తరుణుండు విచ్చేసి
కొమ్మతోడఁ గొంత గోష్ఠి జరిపె. 567

క. కలియఁగ నొకటియు నొకటియు
నిల రెండగుఁ; గాని యొకటియేయగుఁబో! పూ
విలుకాని గణితశాస్త్రము
వలనన్; మేలగును లాఘవమె కొండొకచోన్. 568

ఆ. "వావి మేనత్తవై నన్ను బాలు వలచి
తగునె?" యని మేలమాడ మేనల్లుఁ డింతి
"హరిని మఱగదె యా రాధ! అత్తపొత్తు
ఆయువుం బెంచు నల్లుని" కంచునవ్వె. 569

క. అల కౌశికు మేనకవలెఁ
జెలువ నను సమాధి మగ్నచిత్తునిఁ గనుచున్
బలువిధములైన లాస్యం
బులు సలుపుచు నాదు నేత్రములఁ దెఱపించెన్. 570

క. నాయకుఁడై నాటకమున
నాయికతోడను నటించు నాథునిఁగని త
జ్జాయ తలంచెను దానే
నాయిక భూమికను దాల్ప, నాటిన శంకన్. 571

ఆ. ముద్దులాఁడి! నిన్ను ముద్దాడిపోయినం
గాని నాకుఁ గాదు గార్యసిద్ధి;

అటులు గానినాఁడు కటకటా! మతిమాలి
యొకటి సేయఁబోవ నొకటి యగును. 572

గీ. వలచె వలపులాఁడి ప్రతివేశి నొక్కతె;
దానిపతిని వలచె వాని సాధ్వి
సంప్రతించుకొని సుసమయంబునను వారు
క్రొత్తకాపురములు గూర్చుకొనిరి. 573

క. కిటికీలోపలఁ బ్రియురాల్
కిటికీవెలుపటఁ బ్రియుండు గేల్ముద్దులతో
గుటకలు మ్రింగుచు నిలిచిరి
తటతట కొట్టుకొను కీరదంపతివోలెన్. 574

క. "సహనావవతు" సుమాస్త్రుఁడు
సుహితుఁడు; సహ నౌ భునక్తు చుంబనశతమున్
రహి "సహవీర్యం కరవా
వహై" స్మర రణాంగణముల బాలామణిరో! 575

31.7.62

క. "అనయం బీ స్మరగీతను
వనితామణులార ! పట్టువదలక పారా
యణ మొనరించినయెడ శో
భనములపై శోభనములు వడయుదురుసుఁడీ !"

క. అని గుర్వి కఱప యువతీ
జనంబు సమ్మోదమొంది సాఁగిలఁబడి దీ
వన లంది మరులుగొని చనెఁ
దనతన సంకేతమునకుఁ దరుణులఁ గలియన్.

## శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

### ముద్రిత గ్రంథములు :

1. కావ్యాలంకార సంగ్రహము సవివరణము 12.00
2. తత్సమచంద్రిక 7.00
3. జాతక కథాగుచ్ఛము ప్రథమభాగము 1.50
4. ,, ద్వితీయభాగము 1.50
5. ద్వంద్వయుద్ధము 1.00
6. కీరసందేశము 1.00
7. ఖడ్గతిక్కన 1.00
8. వివేకానందము 2.00
9. వాసవదత్త 1.00
10. పువ్వులతోఁట 1.00
11. కావ్యమంజరి 0.50
12. నడుమంత్రపుసిరి 0.50
13. గోవర్ధనాచార్య సప్తశతీసారము 1.00
14. అమృతకణములు 0.50
15. రేణుక విజయము 2.00
16. ఆంధ్ర కథావిలాసము 1.00
17. ఆంధ్ర కావ్యకథలు ప్రథమభాగము 1.00
18. ,, ద్వితీయభాగము 1.00
19. వ్యాస పారిజాతము 2.50
20. కావ్యమాల 1.50
21. కథాకదంబము 1.50
22. స్మరగీత 5.00

### అముద్రితములు :

1. జాతక కథాగుచ్ఛము (తృతీయభాగము)
2. కాదంబరీ కల్యాణము (నాటకము)
3. వ్యాసకోశము
4. గురుద్రోహి



### ముద్రిత సంస్కృతగ్రంథములు :

1. పూర్ణపాత్రమ్
2. త్రికమ్-(కీరసందేశ, విప్రవీర, మధుకోశనామక గ్రంథత్రయమ్)
3. రామదాసమ్
4. వివేకానందమ్

### అముద్రితమ్ :

1. కచదేవయానీయమ్
2. తెనాలి రామలింగకథాః